# విమర్శకునిగా రాళ్ళపల్లి

వి. రమాంజనీ కుమారి

హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయానికి 1983 లో
యం. ఫిల్. డిగ్రీకై సమర్పించిన పరిశోధక వ్యాసం

విమర్శకునిగా రాళ్ళపల్లి
యం. ఫిల్. పరిశోధక వ్యాసం
వి. రమాంజనీ కుమారి

రచనా కాలం : 1983

ప్రచురణ : అక్టోబర్ 1987

ప్రతులు : వేయి



ముఖచిత్రం : శీలావి

ప్రచురణ : ఫ్రెండ్స్ పబ్లికేషన్స్
1-8-702,/92/2
నల్లకుంట, హైదరాబాద్-44.

ముద్రణ : డాన్ ప్రెస్,
ఖైరతాబాద్, హైదరాబాద్-4
ఫోన్ నెం 220642

ప్రతులకు : నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సుల్తాన్‌బజార్, హైదరాబాద్,
ఫోన్ నెం. 44688

వెల : పది రూపాయలు

---

తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయంచే ముద్రితం

---

అన్నింటా అండగా నిల్చిన అమ్మా నాన్నలకి, లక్ష్మణ మామయ్యకి భానుఅక్కకి-

'విమర్శకునిగా రాళ్ళపల్లి' అనే శీర్షికను స్వీకరించినప్పటి నుంచి మార్గదర్శక సూత్రాలను ఇచ్చి పరిశోధక వ్యాస పరిసమాప్తి పర్యంతం ప్రోత్సాహాన్నిచ్చిన ఆచార్యులు శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు గారికి-

శీర్షికా విషయంలో ఆమోదాన్ని తెలిపి సముచిత సలహాలిచ్చిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి-

పరిశోధన సమయంలో ఆర్థిక సహాయాన్ని అందించిన హైదరాబాద్ విశ్వవిద్యాలయాధికారులకు-

పరిశోధనా విషయానికి అవసరమైన విషయాలు, విశేషాలు అందించి ప్రోత్సహించిన రాళ్ళపల్లి వారికుమార్తె శ్రీమతి నాగమణి గారికి-

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయాన్నిచ్చిన తెలుగు విశ్వవిద్యాలయానికి, అన్నివేళలా సహాయ సహకారాలందించిన మిత్రులు శ్రేయోభిలాషులు వాసుదేవ్, శ్యాంసుందర్, చంద్రశేఖర్, రవీంద్రనయ్య, అంజలి, శాంతి, సుధ, ఉమ, సుమతి, దామోదర్, రాంబాబు- అందరికీ

నా కృతజ్ఞతలు

—రమాంజని

# ముున్నుడి

విమర్శకునిగా రాళ్ళపల్లి వారి వ్యక్తిత్వాన్ని సమీక్షించడం ప్రధాన లక్ష్యం అయినా—

'రాళ్ళపల్లివారి జీవితము - రచనల'కు సంబంధించిన పరిచయం చేశాను. 'రాళ్ళపల్లికి పూర్వరంగం'లో ఉన్న తెలుగు సాహిత్య విమర్శ విధానాన్ని సమీక్షించాను.

రాళ్ళపల్లివారు తెలుగు సాహిత్యానికి నూత్నంగా ప్రసాదించిన సాహిత్య సౌందర్య తత్త్వ దర్శనాన్ని ఆంగ్ల కాల్పానిక యుగ విమర్శకుల అభిప్రాయాల ఆధారంగా వివరించాను. రాళ్ళపల్లి వారిపై ప్రభావాన్ని చూపిందనే కట్టమంచి రామలింగారెడ్డి గారి విమర్శ విధానాన్ని కూడా స్థూలంగా పరిచయం చేశాను. వీరిరువురికి ఉన్న దృక్పథాల అంతరాన్ని వివేచించాను.

'రాళ్ళపల్లి - విమర్శ'ల పరిశీలనలో రాళ్ళపల్లి వారు వెలిబుచ్చిన అభిప్రాయాలను వివరించి, ఆయన విమర్శ విధానాన్ని; ప్రాచ్య, పాశ్చాత్య అభిప్రాయాల సమన్వయం ఆధారంగా-రాళ్ళపల్లిని 'కొత్తపాతల మేలుకలయిక'గా భావించి ఆ విషయాన్నే విశదీకరించాను.

పరిశీలనకు అముద్రితాలు గ్రహించలేదు. సంగీత సంబంధ పీఠికలను స్థూలంగా చర్చించాను.

—రమాంజని

# విషయసూచిక


| | | | పుటలు |
|---|---|---|---|
| | కృతజ్ఞతలు | | v |
| | మున్నుడి | | vi |
| 1 | అధ్యాయం | రాళ్ళపల్లి జీవితము-రచనలు | 1 |
| 2 | అధ్యాయం | తెలుగు సాహిత్య విమర్శ- రాళ్ళపల్లికి పూర్వరంగం | 14 |
| 3 | అధ్యాయం | సాహిత్య సౌందర్య తత్త్వ దృక్పథము | 20 |
| 4 | అధ్యాయం | రాళ్ళపల్లి వారి విమర్శలు | 32 |
| | | 1. సారస్వత వ్యాసములు | 33 |
| | | 2. నాటకోపన్యాసములు | 44 |
| | | 3. రాళ్ళపల్లి పీఠికలు | 50 |
| | | 4. వేమన | 63 |
| 5 | అధ్యాయం | ముగించే ముందు | 75 |
| | | జ్ఞాపికలు | 80 |
| | *అనుబంధాలు* | | 83 |
| | | i. శ్రీమతి నాగమణి గారితో ముఖాముఖి | 84 |
| | | ii. రాళ్ళపల్లి రచనల పట్టిక | 86 |
| | | ఉపయుక్త గ్రంథ సూచిక. | 89 |

# రాళ్ళపల్లి జీవితం - రచనలు

తెలుగు సాహిత్యంతో ఏ కొద్ది పరిచయం ఉన్నవారికయినా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి పేరు సుపరిచితమే. ఆయన రాసిన రాయలనాటి రసికత, తిక్కన తీర్చిన సీతమ్మ, నిగమశర్మ అక్క మొదలైన వ్యాసాలను ఏదో ఒక తరగతిలో చదవని తెలుగు విద్యార్థులు ఉండరు. సమకాలీన సాహిత్య ప్రక్రియలపై రాళ్ళపల్లివారి అభిప్రాయాలు తెలుగు సాహిత్య విమర్శకు మెరుగులు దిద్దాయి. అభిరుచి విమర్శకునిగా, గ్రంథ పరిష్కర్తగా, నిష్పక్షపాత పీఠికాకర్తగా ఆయనస్థానం అద్వితీయం. విమర్శకునిగా రాళ్ళపల్లి వ్యక్తిత్వాన్ని సమీక్షించే ముందు ఆయన జీవితము, రచనలకు సంబంధించిన సంక్షిప్త పరిచయం అవసరం.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 1893 జనవరి 23 వ తేదీన అనంతపురం జిల్లా, కళ్యాణదుర్గం తాలూకాలోని 'రాళ్ళపల్లి'గ్రామంలో జన్మించారు. వీరి తండ్రి కర్నమడకల కృష్ణమాచార్యులు. తల్లి అలివేలు మంగమ్మ. శర్మగారి అమ్మమ్మ లక్ష్మమ్మ గారు. వారికి పుత్రసంతానం లేనందున అనంతకృష్ణశర్మగారిని దత్తత చేసుకున్నారు. అందుచేత శర్మగారి ఇంటిపేరు 'రాళ్ళపల్లి' అయింది. శర్మగారి తండ్రికూడా 'రాళ్ళపల్లి' లోనే స్థిరపడ్డారు.

అనంతకృష్ణశర్మగారికి తండ్రిగారే అక్షరాభ్యాసం చేశారు. పదమూడేళ్ళకే సంస్కృతంలో రామాయణ సంగ్రహం, రఘువంశం, చంపూ రామాయణం, చంపూభారతం, విశ్వగుణాదర్శం, తెలుగులో అచ్చతెలుగు రామాయణం, నీలాసుందరీపరిణయం, ఆంధ్రనామ సంగ్రహం మొదలైన వానిని చదివారు.

రాళ్ళపల్లిలో విద్యాసౌకర్యాలు లేవు. అందువల్ల 1906 తరువాత రాళ్ళపల్లి విద్యాభ్యాసమంతా మైసూరులోనే జరిగింది. పరకాల మఠంలో శ్రీ వైష్ణవ విద్యార్థులకు ఉచిత భోజన వసతి సౌకర్యాలుండేవి. [illegible]

మఠంలో చేరారు. ఒకటిన్నర సంవత్సరాలు నల్లూరు (అనంతపురం జిల్లా పెనుగొండ తాలూకా) కు చెందిన సజ్జయ్య తాతాచార్యుల వద్ద భారవి కిరాతార్జునీయం మొదలైనవి చదివారు. చామరాజేంద్ర సంస్కృత మహా పాఠశాలలో విద్యార్థిగా సంస్కృత, ప్రాకృత వ్యాకరణాలు, శాకుంతలం మొదలైన నాటకాలు చదివారు.

పరకాల మఠం పీఠాధిపతి శ్రీకృష్ణ బ్రహ్మ తంత్ర పరకాల యతీశ్వరులకు శర్మగారంటే ప్రత్యేకాభిమానం. వారు శర్మగారికి శ్రీవైష్ణవ దీక్షనిచ్చి సమాశ్రయణ మహా మంత్రోపదేశాన్ని చేశారు. శర్మగారు మఠంలో చేరే నాటికే యతీశ్వరులకు అరవై అయిదేళ్ళు. అప్పటికి అనేక గ్రంథాలు రచించారు. తిరుపతి వేంకటకవులు తెలిగించిన 'శ్రీనివాస విలాస చంపువు' ను సంస్కృతంలో రచించినది యతీశ్వరులే. ప్రతియేటా పరకాల మఠంలో శ్రావణ శుక్లపక్షంలో విద్వత్సభలు జరిగేవి. ఒక సభలో శర్మగారు నాలుగు సంస్కృత వృత్తాల్ని చదివారు. వాటిని విన్న యతీంద్రులు ఆయననుమెచ్చుకున్నారు. ఆ సంఘటనను గూర్చి శర్మగారు నమ్రతతో ఇలా అన్నారు.

"ఇది శ్రీవారి సాహితీ రసికతా వైశాల్యమును తెలుపునంతే. అనాటి నా కవిత నాజ్ఞప్తిలో లేదు. ఉండవలసిన ఏ గుణమును దానికి లేదనుట నాకే తెలియును."[1]

ఆ రోజుల్లో యతీంద్రులు లక్షణ, లక్ష్యాలతో, 'అలంకార మణిహారము' అనే గ్రంథాన్ని రచిస్తున్నారు. వారికి కంటి చూపు సరిగా లేనందున అవసరమైన కావ్య, గ్రంథ విషయాలను చదివి వినిపించడం, వారు చెప్పినదానిని రాయడం రాళ్ళపల్లి చేసేవారు. ఈ సమయంలో శర్మగారి సందేహాలకు సమాధానమిస్తూ, వీరి అభిప్రాయాల్లో యుక్తమని తోచిన వాటిని యతీంద్రులు స్వీకరించేవారు.అలంకార మణిహారంలోని ఉత్తరార్ధంలో శర్మగారి అభిప్రాయాలు చోటుచేసుకున్నట్లుగా ఘట్టమరాజు అశ్వత్థనారాయణ రాశారు.[2]

తరువాత చామరాజు నగరం రామాశాస్త్రిగారి వద్ద విద్యనభ్యసించారు. శాస్త్రిగారు సంస్కృతంలో ఉద్దండ పండితులు. పెద్దవయసు. కవిత్వం రాయగలిగే శక్తి సామర్థ్యాలున్నా కాళిదాసు, భవభూతుల కవిత్వానికేమన్నన అరుదైన ఈ కాలంలో తమ కవిత్వమేపాటిది అని భావించారు. వీరి దగ్గర ఉత్తర రామ చరిత్ర, ముద్రారాక్షసం, అనర్ఘరాఘవం అనే నాటకాలు కాదం

బరిలో కొంత భాగాన్ని చదివారు. ఈ విధంగా సంస్కృత సాహిత్యంలో రాళ్ళపల్లికి వ్యుత్పత్తి కలిగింది. కాని కన్నడ దేశంలో నివసించడం చేత బాల్యంలో నేర్చుకున్న తెలుగును అశ్రద్ధ చేయడం జరిగింది. కట్టమంచితో పరిచయమేర్పడిన తరువాత ఈ కొరత కూడా తీరింది. ఇది 1910 లో కట్ట మంచి శిష్యులు కందాళ రఘునాథాచార్యులు రాళ్ళపల్లి వారికి వియ్యంకులు. రఘునాథాచార్యులు రాళ్ళపల్లిని కట్టమంచికి పరిచయం చేశారు. అప్పుడు కట్ట మంచిరామలింగారెడ్డి మైసూరు మహారాజా కళాశాలలో అధ్యాపకులు. చరిత్ర, తర్కం, తత్త్వశాస్త్రం, ఆంగ్ల సాహిత్యాలను బోధించేవారు. రెడ్డిగారితో పరి చయం తనకు ఆధునిక ప్రపంచపు తలుపులు తెరచి ఆహ్వానించినట్లయిందని రాళ్ళపల్లి నా గురువులు అనే వ్యాసంలో రాశారు. తెలుగుకావ్యాలు ముఖ్యంగా కవిత్రయ రచనలపై వీరిరువురు చర్చించుకునే వారు ఈ విధంగా తెలుగు సాహిత్యంపై శర్మగారికి అభిరుచి పెరిగింది. రెడ్డిగారు అర్ధ శాస్త్రం, కవిత్వ తత్త్వ విచారాలను అచ్చు ప్రతిని తయారు చేయడానికి శర్మగారికిచ్చారు. "ఆ సమయమున సామాన్య సాహిత్యమునకు సంబంధించిన తెలివిడి, కనువిప్పు నాకెంతో కలిగినది....... నా యభిప్రాయములలో ఏమైనను తీవ్రత, ఆర్జ వమును కలదేని వారి సహవాస ప్రసాదము, ఉపదేశ ఫలము"[3] అని రాళ్ళ పల్లి చెప్పుకున్నారు. తెలుగు సాహిత్యాన్ని కూలంకషంగా చదివే అవకాశం ఈ సందర్భంగా శర్మగారికి లభించింది.

కట్టమంచితో చర్చించే సమయంలో పాశ్చాత్య సాహిత్య లక్షణాలు అవగతమయ్యాయి. ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య లక్షణాల సమన్వయానికి రెడ్డిగారి పరిచయం దోహదం చేసింది. తరువాత కాలంలో సమన్వయ విమ ర్శకులుగా అనంత కృష్ణశర్మగారికి తెలుగు సాహిత్య విమర్శ చరిత్రలో స్థానం లభించింది.

రెడ్డిగారితో ఏర్పడిన పరిచయం దినదినాభివృద్ధి చెందింది. రెడ్డిగారి కోరిక మేరకు మైసూరు మహారాజా కళాశాలలో ప్రప్రథమంగా ఏర్పాటు చేసిన తెలుగు పండిత పదవిని (3-7-1912) చేపట్టారు. 1949 వరకు ఆ కళాశాలలోనే అధ్యాపకులుగా ఉన్నారు. వీరి ప్రతిభను గుర్తించిన విశ్వవిద్యా లయాధికారి ఒకరు ప్రత్యేకంగా శర్మగారి ఉద్యోగ స్థాయిని పెంచుతా

మన్నారు. కాని ఇతర పండితుల స్థాయిని పెంచకుండా తమకొక్కరికే ప్రత్యేకత చూపడానికి శర్మగారు సమ్మతించలేదు.[4]

ఈ కళాశాలలో ఉద్యోగం రాకపూర్వమే శర్మగారికి రుక్మిణమ్మగారితో వివాహమైంది. ఆమె అన్ని విధాలా శర్మగారికి అనుకూలంగా ఉండేవారు. గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు ఆమెనీ విధంగా ప్రశంసించారు –

"బయటి జగమెరుగని ఏకాంత పరిశ్రమ జీవి......

వీరి కీర్తికి ఆయమ పరిచర్యయే మూల స్తంభము."[5]

శర్మగారికి సంగీతంపై ఆసక్తి ఎక్కువ. వీరి అమ్మగారిది శ్రావ్యమైన కంఠం. శాస్త్రం తెలియకున్నా శ్రావ్యంగా తెలుగు, కన్నడ, తమిళ భాషల్లో పెళ్ళిపాటలు, భజన కీర్తనలు, జోలలు, పూజ పాటలు కథాగేయాలు పాడుతుండే వారు. శర్మగారు అక్క యదుగిరమ్మతో పాటు రోజూ సంగీత సాధన చేసేవారు. రాళ్ళపల్లి గ్రామంలోని రామభజన సంఘంలో తమవయసు వారిలో రాళ్ళపల్లి వారిదే పై చేయిగా ఉండేదట.

మైసూరులో యతీంద్రులు సంగీత ప్రియులే కాని శ్రోత్రియ వాతావరణం నెలకొన్న మఠంలో సంగీతసాధనకు అవకాశం కలుగలేదు. ఆ రోజుల్లో వీణశేషన్న, వీణసుబ్బన్న, బిడారం కృష్ణప్ప, వాసుదేవాచార్యులు, చిక్కరామారావు వంటి గొప్ప విద్వాంసులు మైసూరులో ఉండేవారు. శర్మగారు ఉత్సవ సమయాల్లో జరిగే జంత్ర, గాత్రకచ్చేరీలకు వెళుతూ సంగీతాధ్యయనం చేస్తూండేవారు.

1910వసంవత్సరం జ్యేష్ఠ శుక్ల ఏకాదశినాడు కీర్తిశేషులైన ముమ్మడిశ్రీ కృష్ణరాజ ఒడయరు గారి వర్ధంతి. ఆ రోజున 'అంబావిలాస' సంభాంగణంలో తంబుర శ్రుతితో బిడారం కృష్ణప్పగారి పాటను శర్మగారు విన్నారు. అది త్యాగరాజస్వామికృతి 'ధ్యానమే వరమైన గంగా స్నానమే మనసా' అనేది. ఆనాటినుంచి ఎలాగైనా సంగీతం నేర్చుకోవాలి అనే పట్టుదల శర్మగారిలో పెరిగింది. వారి వద్ద, వీరివద్ద సరిగమల మొదలు వర్ణాలు, కీర్తనల దాకా నేర్చుకున్నారు. చివరకు ధైర్యంచేసి బిడారం కృష్ణప్ప గారి నాశ్రయించారు. వారు కూడ సహృదయంతో యథావకాశంగా నేర్పారు, సంగీత సాధనకు తగి

నంత సమయమూ, అవకాశమూ శర్మగారికి లభించేదికాదు. 1918లో దేశంలో వ్యాపించిన 'ఇన్ఫ్లుయెంజా' శర్మగారికి కూడ సోకింది. దానితో శరీరంకూడ బలహీనమయింది. చిన్నతనంలో అన్నగారిని చూచి నేర్చుకున్న ఫిడేలునే మరల సాధన చేయడం మొదలు పెట్టారు. వీణశేషన్న, వాసుదేవాచార్యుల వారి పాటను చాలసార్లు విన్నారు. వీణశేషన్న గారిని గూర్చి ఆయనకు నేను శిష్యుడనుగాను గానినాకేమో ఆయన గురువే" అని రాళ్ళపల్లి చెప్పుకున్నారు.

1927 లో ద్వితీయాంధ్ర గాయక మహాసభ అనంతపురంలో జరిగింది. ఆ మహాసభలో శర్మగారు 'గానకళ'పై ఉపన్యసించారు. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు, కట్టమంచి వంటి పెద్దలను ఈ ఉపన్యాసం ఆకట్టుకుంది. నాగేశ్వరరావు పంతులుగారు "గానకళ" ఉపన్యాసాన్ని వ్యాస రూపంలో 1500 ప్రతులు ముద్రించారు. విడిగా ఆయిదారువేల ప్రతులుకూడ ముద్రించి శర్మగారికోరికపై ఉచితంగా ఆంధ్రదేశమంతటా పంచిపెట్టారు. ఆ వ్యాసం కన్నడంలోకి అనువాదితమయింది.

మైసూరులోని 'ప్రసన్న సీతారామ మందిరము' వారు 1961 లో చతుర్థ సంగీత సమ్మేళనాన్ని నిర్వహించారు. దీనికి శర్మగారు అధ్యక్షులు. ఈ సమ్మేళనలో శర్మగారికి 'గానకళా సింధు' బిరుదు ప్రదానం జరిగింది. 1964 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. శర్మగారి సేవలను పురస్కరించుకొని అకాడమీ "గానకళా ప్రపూర్ణ" బిరుదుతో సన్మానించింది. 1969లో కర్ణాటక సంగీత నాటక అకాడమీ శర్మగారిని బెంగుళూరులో సన్మానించింది. బెంగుళూరు గాయన సమాజం శర్మగారిని ద్వితీయ సంగీత సమ్మేళనానికి అధ్యక్షులుగా ఎన్నుకుని "సంగీత కళారత్న' బిరుదంతో సత్కరించింది. 1974లో మద్రాసు మ్యూజిక్ అకాడమీ 'సంగీత కళానిధి' బిరుదుతోను, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం (30-4-1974) గౌరవ డి. లిట్. పట్టంతోను గౌరవించాయి.

మైసూరు మహారాజా కళాశాలలో పండిత పదవి నుంచి విశ్రాంతి తీసుకున్న పిమ్మట కొంతకాలానికి (1950 అక్టోబరు) తిరుపతి ప్రాచ్యపరిశోధన శాఖలో సంగీత వాఙ్మయ పరిశోధకులుగా చెలికాని అన్నారావుగారి కోరికపై ప్రవేశించారు. తాళ్ళపాక కవుల సంకీర్తనలు పరిష్కరించి వేర్వేరు సంపుటా

లుగా ప్రకటించారు. తరువాత కూడ దాదాపు పదహారేళ్ళపాటు (1960-1976) తాళ్ళపాక అన్నమయ్య పాటలు, శృంగార సంకీర్తనలు పరిశోధించి ప్రకటించారు.

అనంత కృష్ణశర్మగారు సంగీతాన్ని తపస్సుగా భావించి సాధన చేసిన మనీషి. వారి జీవితానికి సంగీతానికి అవినాభావ సంబంధముంది. సంగీతాని కాలవాలమైన సాత్విక చిత్తవృత్తి ఆయనది. ఆయనకు సంగీతం వృత్తికాదు. ప్రవృత్తి. శర్మగారు వాగ్గేయ కారులు కూడా.

గానరసమూర్తి త్యాగరాజు పాటలు తేనెల తేటలు— అనే కీర్తన వీరి ప్రప్రథమ స్వీయరచన. మిగిలిన వాటిలో ప్రసిద్ధమైన పన్నెండు కీర్తనలున్నాయి. ఒక ''తిల్లాన'' కూడా ఉంది.

ఎనభై సంవత్సరాల వయసులో కూడా క్రమం తప్పక సాధన చేసే వారు. అప్పుడుకూడా ఇప్పుడిప్పుడే కొన్ని రాగాలు పట్టుబడుతున్నాయని అనే వారట.

శర్మగారి రచనావ్యాసంగం విశ్వగుణాదర్శాన్ని రచించిన వేంకటాధ్వరి రాసిన సుభాషిత కౌస్తుభంలోని నూరుపద్యాలను ఆంధ్రీకరించడంతో మొదలైంది. అయితే ఈ ఆంధ్రీకరణ వారికే సంతృప్తి కలిగించక పోవడంతో శర్మగారు దాన్ని చించివేశారు.

''తారాదేవి'' అనే ఖండ కావ్యాన్ని (1911) రచించారు. దీనిలో 175 గద్యపద్యాలున్నాయి. కట్టమంచి ఈ కావ్యాన్ని చదివి ప్రశంసించి, ప్రచురించడానికి మిత్రులు సరస్వతీ పత్రికాధిపతులు అయిన కొచ్చెర్ల కోట వెంకటకృష్ణారావు బహద్దూరు గారికి పంపారు. ఇది 1911లోనే కాకినాడ నుండి వెలువడే సరస్వతీ పత్రికలో ప్రచురితమైంది. మేవాడు రాజకుమారుడు క్షత్రియకన్య ''తార''ను ప్రేమించి పెళ్ళిచేసుకోవడం, వారిద్దరికీ 'హమీర సింగు' అనే కుమారుడు జన్మించడం 'తారాదేవి' లోని ఇతివృత్తం. వీర, శృంగార రసాలను సమపాళ్ళలో మేళవించి రచించిన కావ్యమిది. తెలుగు నుడికారాలు, సామెతలు ఈ కావ్యంలో ఉన్నాయి. పాత్ర చిత్రణాదృష్టి, కథాకథనకౌశలం ఇందులో ప్రబలంగా కనిపిస్తాయి.

1926లో 'భార్గవీ పంచవింశతి'ని అనంతపురంలోని సాధన ముద్రా

క్షర శాల ప్రచురించింది. శర్మగారు మైసూరుతో ఉండటంలో వ్యవసాయం సక్రమంగా సాగలేదు. వివాహానంతరం (1911-12) ఉద్యోగం రాకపూర్వం ఆర్థికంగా ఇబ్బందుల నెదుర్కోవాల్సి వచ్చింది. "గౌరవంబున జీవింపనను గ్రహింపు మదియే పూర్ణంబగున్ భార్గవీ— అని ప్రార్థిస్తూ "శుక్రవార పద్యాలు" అనే పేరుతో పది పద్యాలు రాశారు. వీటితో కొన్ని తరువాత రాసినవి. మరికొన్ని "భార్గవీ పంచవింశతి"గా ముద్రితమయ్యాయి.

"మీరాబాయి" అనే విషాదాంత ఖండ కావ్యాన్ని 1912లో రచించారు. చరిత్రలో మనకు తెలిసిన 'మీరాబాయి' కథకు కొద్ది మార్పులు చేసి రాశారు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రాసిన రాజస్థాన కథావళినుంచి ఇతివృత్తాన్ని స్వీకరించారు. చరిత్రాంశం నమ్మదగినది కాకుండుట వలన, రసభంజకము గావునను దానిని పాటింపక ఖేదాంతముగా వ్రాసితినని రాళ్ళపల్లి పీఠికలో చెప్పుకున్నారు. దీనిలో 163 గద్య పద్యాలున్నాయి. కావ్యారంభంలో దైవస్తుతి, గురుస్తుతి ఉన్నాయి.

> పరమ కృపావిశేషమున। భావన దైవత భాష నెంతయున్
> దిరముగ నాకు నేర్పెడు సుధీవరుఁన్గురులన్ దలించి, సుం
> దరమగు తిక్కనాదుల యుదార కవిత్వ రసంబుగ్రోలి యీ
> చిరుత తెనుంగు । గబ్బమును జెప్పెడు వాడ । 'ననంతకృష్ణుడన్'
>
> (మీరాబాయి ప-4-పు 3)

అని చెప్పి కథను ప్రారంభించారు. దీనిని రాజమండ్రినుంచి వెలువడే మానవ సేవ పత్రిక 1913లో ప్రచురించింది.

తెలుగులో భావకవితా ఛాయలు కన్పిస్తున్న కాలం. ఖండ కావ్యరచన ఆరంభమవుతున్న సమయమది. ఆ సమయంలో వీరరసభరిత కావ్యాన్ని (తారాదేవి), విషాదాంత కావ్యాన్ని (మీరాబాయి) రాళ్ళపల్లి రచించారు. ఈ విషయాన్ని కట్టమంచి రాళ్ళపల్లి యోగ్యతా పత్రంలో కూడ పేర్కొనడం విశేషం.

"Mr. Sarma has written two poems in Telugu 'Tara' and 'Mirabai' which mark rather new developments in poetic feeling and form in Telugu literature."

కాళిదాసు రఘువంశాన్ని 1912లో ఆంధ్రీకరించారు. కాళిదాసు శయ్యాసౌభాగ్యాన్ని కొంతవరకయినా పొందలేకపోయానని భావించి దానిని ప్రచురించలేదు. భాసుని స్వప్న వాసవదత్తను తెలిగించి అనువాదం సరిగా లేదని చించివేశారు.

'పెద్దన్న పెద్దతనము' అనే వ్యాసాన్ని ఇరవై పుటలు రచించి అసంపూర్తిగా ఉంచారు.

1913లోవీరి 'లీలాదేవి' నవలను నిడదవోలులోని ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయం ప్రకటించింది. వంగభాషలో దీనిని యోగీంద్రనాథ భటో పాధ్యాయులు రచించారు. కర్ణాటక భట్ట బాణుడని ప్రసిద్ధి గాంచిన శ్రీమాన్ బి. వేంకటాచార్యులు ఈ నవలను కన్నడంలోకి అనువదించారు.

''ఇందలి కథాకల్పన మతి మనోహరముగను, నాతి విస్తరముగను నున్నందున గృపాపూర్ణముగ వారిచ్చిన యనుమతి వడసి తగు మార్పులు చేసి ఆంధ్రీకరించి నానని" పీఠికలో రాళ్ళపల్లి చెప్పారు.

చంద్రకవి కృతమైన 'శ్రీకృష్ణ భూపాలీయము'ను పరిష్కరించారు. ఈ గ్రంథ పరనమే "రాయలనాటి రసికత'' "రాయల వైదుష్యము'' మొదలైన వ్యాసాలు రాయడానికి రాళ్ళపల్లికి ప్రేరణ కలిగించి ఉండవచ్చు.

మైసూరు మహారాజు నాల్మడి కృష్ణరాజ ఒడయర్ జరిపిన విద్వత్సభలో 'శ్రీమహీశూర రాజ్యాభ్యుదయాదర్శః"సంస్కృత చంపూకావ్యం (1925) ప్రథమ బహుమతి పొందింది. చామరాజేంద్ర నాల్మడి కృష్ణ రాజేంద్రుని ముప్ఫయ్యేళ్ళ పాలనలో మైసూరులో జరిగిన అభివృద్ధి ఈ కావ్యేతివృత్తం.

1928 జనవరి 19 వతేదీ (గురువారం) ఆంధ్రపత్రికలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు 'వేమన' పై ఉపన్యాసాలిప్పించడానికి చేసిన ప్రకటన వెలువడింది. శర్మగారి స్నేహితులు సి. ఆర్. నరసింహశాస్త్రిగారీ విషయాన్ని శర్మ గారికి తెలిపారు. కాని వారంతగా శ్రద్ధచూపలేదు. చివరకు కట్టమంచి మాట కాదనలేక శర్మగారు దరఖాస్తు చేశారు. వేమనపై ఉపన్యసించే అవకాశం శర్మగారికే లభించింది. 1917 లో వావిళ్ళవారి 'వేమన పద్యాలు' గ్రంథానికి రాళ్ళపల్లి పీఠిక రాశారు. అందులో అంతకుముందు వేమనపై మాట్లాడిన వారివలె స్థల, కాల నిర్ణయాలపై వాదన చేయక వేమన కవిత్వం,

శైలి మొదలయిన విషయాలను తడవినారు. వేమనకు అంతకుముందే పట్టం కట్టిన కట్టమంచి సూచనలు రాళ్ళపల్లి అభిప్రాయాలకు మెరుగులు దిద్దాయి

వేమనపై ఉపన్యాసాల కార్యక్రమం కాకినాడలో జరగాల్సి ఉండగా అనివార్య కారణాలవల్ల అనంతపురంలోనిసీడెడ్ డిస్ట్రిక్ట్స్ కాలేజి ప్రాంగణంలో జరిగాయి. 1928 అక్టోబరు 25 వతేదీనుంచి వరుసగా ఏడు రోజుల పాటు ఉపన్యసించారు. ఈ ఏడు ఉపన్యాసాలను ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1929 లో గ్రంథ రూపంలో ప్రచురించింది.[6]

అప్పుడప్పుడు వివిధ విషయాలపై శర్మగారు రాసిన వ్యాసాలు 1930 నుంచి పత్రికలలో ముద్రితమయ్యాయి. అందులో కొన్ని వ్యాసాలు 'సారస్వతోపన్యాసములు"గా పుస్తకరూపంలో ప్రచురితమయ్యాయి. 1954లో వీటికే మరికొన్నిటిని చేర్చి 'సారస్వతాలోకము"గా ప్రచురించారు. ఈ వ్యాసాలలో 'రాయలనాటి రసికత' 'రాయలవైదుష్యము' శర్మగారి అభిరుచి విశిష్టత, నేటి సమాజంపై సున్నితమైన విసుర్లు కల వ్యాసాలు. "ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథుని కీయదగిన స్థానము" అనే విషయంలో వేకుమళ్ళ అచ్యుతరావు గారు, నడకుదుటి వీరరాజు గారు, దర్భా సుబ్రహ్మణ్య శర్మగారు రాళ్ళపల్లితో విభేదించారు "ఎఱ్ఱన కవితకన్న సోమన కవిత కొరత" అనే అభిప్రాయాన్ని వ్యక్తీకరించి రచనా కళకన్న, భావకళ ఉత్తమమైనదని శర్మగారు సోపపత్తికంగా నిరూపించారు.

రంగనాథ రామాయణాన్ని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు గన్నవరపు సుబ్బరామయ్యగారి సహాయంతో పరిష్కరించారు. ఈగ్రంథాన్ని ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రచురించింది. అనారోగ్యం చేత శాస్త్రిగారు సకాలంలో పీఠిక నందించలేక దానికై తయారు చేసికున్న నోట్సును పంపారు. కాని రంగనాథ రామాయణం పింగళిలక్ష్మీకాంతం గారి పీఠికతో కట్టమంచి రామలింగారెడ్డి గారి అనుబంధ పీఠికతో వెలువడింది. వేటూరి వారు పంపిన నోట్సు ఆ పుస్తకంలో చోటు చేసుకోలేదు. ఈ విషయంపైన, రంగనాథ రామాయణ కర్తృత్వానికి సంబంధించి కట్టమంచి అభిప్రాయాలతో తానేకీభవించలేనని "వారి శక్తియుక్తులను గౌరవించినంత హార్దముగా వారి యభిప్రాయములను అంగీకరించుట నావంటి వారికి పలుమాఱు గల్గు భాగ్యముగాదు. ఆవిచాల

మట్టుకు అపూర్వములు స్వచ్ఛందములు, విప్లవాకములు, "అని తెలిపారు. నిగమశర్మ అక్క, తిక్కన్న తీర్చిన సీతమ్మ పాత్ర చిత్రీకరణ విధానాన్ని ఆవిష్కరించే వ్యాసాలు.

శర్మగారు స్వయం సాధన వలన అభ్యసించిన భాష ప్రాకృతం. ప్రాకృతంలో 'హాలుడు' సంతరించిన 'గాథా సప్తశతి' నుంచి కొన్ని గాథలను అనువదించారు. ఇది 1931 లో ప్రచురించారు. తరువాత కొంత కాలానికి జర్మనీ దేశస్థుడగు 'వీబరు' పండితుడు ప్రకటించిన ప్రతినిచూసి 1964 లో మరికొన్ని పద్యాలను రాసి పాతవాటిని సవరించి ప్రచురించారు. దాదాపు నాలుగు వందల గాథలు అనువదించారు. ఈ గాథా సప్తశతి అనువాదాన్ని రామలింగారెడ్డిగారికి భక్తిపూర్వకంగా అంకితమిచ్చారు.

అరమరికలు, ఆడంబరం లేని గ్రామీణ జీవితానికి అద్దం పట్టే గాథలివి. వీటి అనువాదం కూడా నిరాడంబరంగా, ఋజువుగా సాగి విమర్శకుల మన్ననలందు కుంది. ఉదాహరణకు కొన్ని పద్యాలు—

తే. ఇంటి పెద్దల యెదుర । దానెంత మనసు-
నడిచుకొని యుండినను, నీవు వెడిలినపుడు
కనులు మూయుటచే రెప్పకొనలనున్న
దాని కన్నీరు తటుకున ధరణిబడియె

(గాథాసప్తశతీసారము, ప. 289. పు 72)

తే. ఆకులు గొమ్మలును లేక యడవినడుమ।
బొట్టిమ్రోడుగ నెందైన బుట్టవచ్చు ।,
గాని నరలోకమున' జేత గానులేక
రసికుడై దాతయై పుట్టరాదు సూవె'

(గాథాసప్తశతీసారము, ప 184. పు 47)

తే. కలికి ! సాజంబుగా నిండుగనులవాని।
జూచెదవుగాని యరగంట । జూడవలదు
అతని । జక్క ।గ। జూచిన యట్టులగును;
నీవునొక ముగ్ధవనుచు మన్నింతురొరులు.

(గాథాసప్తశతీసారము, ప. 169. పు. 47)

ఈ గాథలలో వ్యక్తమయ్యే లోకరీతులు, సూక్తులు, చమత్కారాలు అనంతకృష్ణ శర్మగారి శైలి సారళ్యం వల్ల సుబోధకాల వుతున్నాయి.

ధర్మవరం రామకృష్ణమాచార్యుల, కోలాచలం శ్రీనివాసరావుగార్ల స్మారకోత్సవ సభలలో (1934 అక్టోబరు 20-21) ఉపన్యసించారు. ఆఉపన్యాసాలే 'నాటకోపన్యాసములు' గా ప్రచురణపొందాయి. మొదటి ఉపన్యాసంలో నాటకాలలో పద్య, గేయౌచిత్యాన్ని చర్చించారు. రెండవదానిలో ధర్మవరం, కోలాచలం వారిరువురి నాటక రచనా విశేషాలు, సమానలక్షణాలు వివరించారు. 'స్త్రీలుమాత్రమే స్త్రీపాత్రలు ధరించవలెను' అనే అభిప్రాయాన్ని ఖండించారు. విషాదాంతనాటకాలను గూర్చి చేసిన చర్చల్లో ప్రాచ్యపాశ్చాత్య లక్షణ సమన్వయం కనిపిస్తుంది.

జాయపసేనాని రచించిన 'నృత్తరత్నావళి'కి సంగీత నాటక ఆకాడమీ తెలుగులో అనువాదం చేయించదలచింది. డా. వి. రాఘవన్ (మద్రాసు) సంస్కృతమూలాన్ని పరిష్కరించి ప్రకటించారు. ఆ ప్రతిని అనంతకృష్ణ శర్మగారు ఆంధ్రీకరించారు. ఆసందర్భంలో "నాట్యనృత్తములలో దేనియందను నాకు ప్రవేశముచాలదు ఉన్నస్వల్ప సంస్కృత భాషా పరిచయ మాధారముగా మాత్రమే యీ తెలిగింపు సాగించితిని"—అని చెప్పారు. ఈ గ్రంథానికి డా. పోణంగి శ్రీరామ అప్పారావు విపులమైన పీఠిక రాశారు. ఇది 1961 ఏప్రెల్ నెలలో ముద్రితమైంది.

సుందర పాండ్య విరచితమైన 'ఆర్యా' అనే సుభాషిత గ్రంథాన్ని రాళ్ళపల్లి ఆంధ్రీకరించారు. ఇది 1970లో ప్రచురితమైంది. ఆటవెలది, తేటగీతి, కందాది ఛందస్సులను వాడారు. చక్కని తెలుగు పలుకుబడులతో, ప్రతి పద్యరమణీయంగా చెప్పిన నీతులు ఈ "ఆర్య" లందున్నాయి. మచ్చుకొకటి రెండు పద్యాలు.

ఆ. విద్యయందపూన్కి వెలయింపవలయు;న -
ర్థంబునంద చనదు తగులమెపుడు;
అర్థములు లభించు నందఱ యెడల; వై -
దుష్యమొకటె జగతి దుర్లభంబు.

(ఆర్యా, ప.88. పు.43)

ఆ. అక్షరములు తక్కువై నిశ్చితముగ ర-
మ్యముగ। బలుకువా।డు మాటకారి;
చేవచాలనట్టి చిలిపిమాటలు పెక్కు-
పలుకువా।డు సుమ్మువదరు।బోతు.

(ఆర్యా. ప-8. పు.11)

బమ్మెర పోతన్న రచించిన "శ్రీమదాంధ్ర మహాభాగవతము"ను శర్మ గారు పరిష్కరించారు. దీనిని 1953లో కడపలోని రాయల్ అండ్ కో ముద్రించింది. తెనాలిరామకృష్ణుని ''పాండురంగమహాత్మ్యము''ను కూడా వీరేపరిష్కరించారు. దీనిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1969లో ముద్రించింది. సాహిత్య అకాడమీ ప్రారంభంనుంచి శర్మగారు సభ్యులుగా ఉన్నారు.

'అనంతకృష్ణశర్మ గారిచేత ఆంధ్రసారస్వత పరిషత్తు పక్షాన వాల్మీకి రామాయణాన్ని గూర్చి కొన్ని ఉపన్యాసాలిప్పించవలెనని భావించామని. అందుకు వారు సూత్రప్రాయంగా అంగీకరించినా, అనారోగ్యకారణంవల్ల ఆపని జరుగలేదు'[7] అని దేవులపల్లి రామానుజరావుగారు రాశారు.

శర్మగారు పెనుగొండ కొండ, అజవిలాపము, అభీతి స్తవము, ఆహ్వానము కుసుమ గుచ్ఛములు, భారతికి సాధువాదము, శమీపూజ మొదలైన కవితలు రాశారు. ఇవన్నీ వివిధ పత్రికలలో వచ్చాయి. వీరివ్యాసవాఙ్మయం చాలావరకు కన్నడంలో అనువాదితమయింది. త్యాగయ్యగారి నాదసుధారసం 'గానకలె' గాను, నాటకోపన్యాసములు 'నాటకోపన్యాస' గాను, రాయలనాటి రసికత 'సాహిత్యమత్తు జీవనకలె' గా అనువదించడం జరిగింది. 'వేమన'ను కూడ సిద్ధవనహళ్ళి కృష్ణశర్మగారు కన్నడంలోని కనువదించారు.

అనంతపుర మండలంనుంచి 1917-1923ల మధ్య వెలువడిన 'వదరు బోతు' వ్యాసకర్తలలో అనంతకృష్టశర్మగారు కూడా ఒకరు.[8]

సమకాలీన సాహిత్యంలో విలసిల్లిన అన్ని సాహిత్య ప్రక్రియలకు నిష్పాక్షిక పీఠికలు రాసిన ఘనత రాళ్ళపల్లికి దక్కింది. తమ పుస్తకానికి రాళ్ళపల్లి చేత పీఠికను రాయించుకోవడం సాహిత్యలోకంలో యోగ్యతగా భావించేవారు.

రాళ్ళపల్లి స్వయంగా వాగ్గేయకారులు. ఆ కాలంలో పదసాహిత్యంలో కృషిచేసిన గౌరవం రాళ్ళపల్లిదే.

సాహిత్య, సంగీతాల్లో కృషిచేసిన రాళ్ళపల్లి సంగీతసాహిత్య సంగమ స్థానంగా భాసించారు. సంగీతంలోని లయను, సాహిత్యంలోని ఆలోచనను వారు ఆత్మీకరించుకున్నారు. వీటి సమన్వయం ద్వారా వెలువడిన విమర్శలు ఒక విశిష్ట వ్యక్తిత్వాన్ని సంతరించుకున్నాయి.

1979 మార్చి పదకొండున తిరుమల తిరుపతి దేవస్థానం రాళ్ళపల్లిని సన్మానించింది. ఇది బెంగుళూరులో అనంతకృష్ణశర్మగారి ఇంటిలో జరిగింది. అన్నమయ్య కృతులందించి శ్రీనివాసుని సేవచేసిన రాళ్ళపల్లి స్వామిసన్మానాన్నందుకున్న కొన్నిగంటలకే పరమపదించారు.

సంగీత సాహిత్యాలకు శక్తికొద్దీ సేవచేసిన వ్యక్తి అనంతకృష్ణశర్మగారు సాహిత్యంలో అభిరుచి, సంగీతంపై ఆసక్తి వారి జీవలక్షణాలు. అయితే ఆయన సంగీత విద్వాంసుడు, సాహిత్యాభిమానిగా మాత్రమే మిగిలి పోలేదు. కవిగా మీరాబాయి, గాథాసప్తశతులను రచించారు. పరిశోధకుడిగా గ్రంథాలను పరిష్కరించి సమగ్ర పీఠికలను తీర్చారు. వీరి వేమన ఒక సిద్ధాంత గ్రంథం ఆయన విమర్శలకు ప్రామాణిక స్థానం లభించింది. భావితరాలకు మార్గదర్శకాలయ్యాయి. గానకళపై ఆయన చేసిన ప్రసంగాలు పలువురి మన్నన లందుకున్నాయి. పాశ్చాత్య ప్రభావంతో సాహిత్యవిమర్శలు వస్తున్నకాలంలో రాళ్ళపల్లి విమర్శలు ఒక సమన్వయ దృక్పథాన్ని, సంయమనాన్ని, స్వతంత్ర విమర్శనా విధానాన్ని వినూత్న సిద్ధాంతాలను ప్రతిపాదించాయి.

రెండు

## తెలుగు సాహిత్య విమర్శ

# రాళ్ళపల్లికి పూర్వరంగం

''సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏకమాపాతమధుర మన్యదా లోచనా మృతమ్''

సంగీతం ఆపాతమధురం, సాహిత్యం ఆలోచనామృతం అని ప్రసిద్ధి. సాహిత్యాన్ని చదివి ఆలోచిస్తేనేగాని దానిలో రామణీయకత అవగతం కాదు. సహృదయుడు కావ్యాన్ని చదివి ఆనందిస్తాడు. సహృదయుడైన విమర్శకుడు కావ్యాపరనంవల్ల తనకు కలిగిన ఆనందాన్ని వివేచించుకుని సాహిత్యతత్త్వ ప్రతిపాదనకుపక్రమించవచ్చు. ఇక్కడే కవికి, సహృదయనికి మధ్య విమర్శకుడు ప్రవేశించి సృజనలోని సౌందర్యాన్ని, తన వివేచనకు అందిన రసరామణీయకాలను వివరిస్తాడు. కావ్యగత భావాన్ని స్పష్టంచేసి, దానికి విలువకట్టి, సాహిత్యంలో దానికొక స్థానాన్ని నిర్ణయిస్తాడు. స్థూలంగా సాహిత్యవిమర్శకుని కర్తవ్యమిది.

ఈ ప్రక్రియ ప్రారంభం కానిదశలో మల్లినాథుడు వ్యాఖ్యలు రాసే సమయంలో తప్పనిసరిగా పాటించిన నియమాలు కొన్ని ఉన్నాయి.

''నాఽమూలం లిఖ్యతే కించిన్నానపేక్షితముచ్యతే—''

అని అమూలము, అనపేక్షితమైన విషయాలను స్పృశించలేదని చెప్పాడు. విమర్శకునికి ఈ లక్షణాలే కాక రాజశేఖరుడు చెప్పినట్లు తత్త్వాన్ని గ్రహించగలిగే శక్తి సామర్థ్యాలుండాలి.

''తత్త్వాభివేశీతు మధ్యేసహస్రం యద్యేకః''[1]— అంటూ అటువంటివాడు ఏకొద్దిమందికవులకో పుణ్యవశాన విమర్శకుడిగా లభిస్తాడని రాజశేఖరుడు చెప్పాడు. విమర్శకుడికి పక్షపాతం ఉండకూడదు. దోషైకదృష్టి కూడదు. కవి భావాన్ని ఆత్మీకరించుకుని, కవి ఏలక్ష్యాన్ని ఉద్దేశించాడో దానికి భంగం కలగని విధంగా విమర్శఉండాలి, కావ్యాన్ని చదవడం ద్వారా తనకు కలిగిన

అనుభూతులను, అనుభవాలను విమర్శకుడు వ్యక్తీకరించాలి. వాటికి వేరుగా ప్రమాణాలను స్వీకరించవలసిన అవసరంలేదు.

ఆరంభంలో తెలుగు సాహిత్యవిమర్శ సంస్కృత కావ్యాలకు వ్యాఖ్యల, సమీక్షల రూపంలో ఉంది. లక్షణగ్రంథాల్లో కావ్యాత్మ, రసం, ధ్వని, ఔచిత్యం మొదలైన విషయాలను ఆలంకారికులు చర్చించారు.

ప్రాచీన కవుల కావ్యావతారికల్లోను, పూర్వకవిస్తుతి, కుకవినింద, చాటువుల్లో రేఖామాత్రంగా విమర్శద్యోతకమవుతుంది.

పద్దెనిమిదవ శతాబ్ది ప్రారంభంనుంచి భారతదేశంలో రాజకీయంగా, సాంఘికంగా చాలా మార్పులు వచ్చాయి. ఆంగ్లేయుల పరిపాలనలో మేధావులు, సామాన్యులు ఏదోవిధంగా ప్రభావితులయ్యారు. ఇంగ్లీషు భాషాభ్యసనం, ముద్రణయంత్ర సౌకర్యం దీనికి దోహదాన్ని చేకూర్చాయి. "సాంఘికరంగమున సంస్కరణాభిలాష, సాహిత్యరంగమున నవ్యసృష్టి, భావనా రంగమున విశృంఖల విహారము, సంప్రదాయ రంగమున వ్యవస్థితవస్తు ధిక్కారము అనునవి సంధియుగమున ధర్మపంచకము"[2]

ఆంగ్ల సాహిత్యపఠనం ఆ కాలంనాటి తెలుగు మేధావుల, కవుల ఆలోచనామార్గాన్ని, దృక్పథాన్ని కొత్తదనంవైపు దృష్టిసారించేలా చేసింది. వివిధ తాళపత్ర గ్రంథాలు పరిష్కరించి ప్రకటించడం మొదలైంది. ఆంధ్రదేశంలో ఆధునిక పరిశోధనకు మెకంజీ పునాదులు వేశాడు.[3]

సి. పి. బ్రౌను తాళపత్ర గ్రంథాల్ని సేకరించి, పరిష్కరించి, పాఠనిర్ణయంచేసి పండితులతో వ్యాఖ్యానాలు రాయించాడు. వివిధ గ్రంథ పరిష్కరణ, పాఠనిర్ణయం కూడా విమర్శలో భాగమే. కావ్యాన్ని ఆమూలాగ్రం చదివి కవిని అర్థంచేసుకునే తెలివితేటలుంటే తప్ప పరిష్కరణ సాధ్యం కాదు. గ్రంథ పరిష్కారవిమర్శ (Textual Criticism) బ్రౌను కాలంలోనే ప్రాచుర్యాన్ని పొందింది. ఆధునిక విమర్శకు ఇది మార్గదర్శకంగా నిలిచింది.

బ్రౌను చేసిన కృషితర్వాత చెప్పదగినకృషి అంతా పత్రికాముఖంగా జరిగిందే. 1842 నుంచి వివిధ సాహిత్యపత్రికలు వెలువడ్డాయి. కావ్యసమీక్షలు, ఆలంకారిక చర్చలు, కావ్యకర్తృత్వవివాదాలు అన్నీ పత్రికల్లో చోటు చేసుకున్నాయి. వీటిలో కొన్నింటిపై ఆంగ్ల భాషా సాహిత్యాల ప్రభావంఉంది.

కందుకూరి వీరేశలింగంగారు రంగప్రవేశం చేసిన తరువాత సాహిత్య కృషి బహుముఖాలయింది. ఆధునికాంధ్ర సాహిత్యంలో వచ్చిన అన్ని ప్రక్రియలను సమర్థవంతంగా నిర్వహించినవారు కందుకూరి. ప్రబంధ శృంగారాన్ని నిరసించారు. సరళ గ్రాంధికంలో రచనలు చేశారు. వీరి 'కవులచరిత్ర' నాటికీ నేటికీ ప్రామాణికంగా నిలిచింది.

వేదం వేంకటరాయ శాస్త్రి ప్రాచ్య, పాశ్చాత్య భాషాసాహిత్య సంస్కారంతో విశిష్ట విమర్శనా దృక్పథాన్ని ప్రకటించారు. వీరి రచనల్లో శాబ్దిక చర్చలు, భాష, వ్యాకరణం, ఛందస్సులకు సంబంధించినవి ఎక్కువగా ఉన్నాయి. "విక్రమార్క చరిత్ర ముద్రణ విమర్శనము", "ఆంధ్రప్రసన్న రాఘవ విమర్శనము," "కాళహస్తి మాహాత్మ్య ముద్రణ విమర్శనము", "తిక్కనసోమయాజి విజయము", "ఆంధ్రగ్రంథ విమర్శన ప్రకారలేశము", "భారతాభారత రూపకమర్యాదలు" మొదలైనవి వీరి ప్రాచ్య, పాశ్చాత్య దృక్పథాన్ని తెలియజేసే విమర్శలు.

కొక్కొండ వేంకటరత్నం పంతులు మొదలైనవారు వేదం వేంకటరాయశాస్త్రి గారి రచనలను, అభిప్రాయాలను ఖండించారు.

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారి "వివేకచంద్రికా విమర్శనము" నవల పై వచ్చిన ప్రథమ విమర్శ. దీనిలో ఇతివృత్తం, రసాలను గూర్చిన పరిశీలన జరిగింది. విమర్శ సమగ్రతను ప్రతిబింబించిన రచన ఇది. శాస్త్రిగారి విమర్శలు చాలావరకు వీరేశలింగంగారి రచనలపై వచ్చినవే.

1892 లో వచ్చిన "పింగళిసూరన" లో పి. దక్షిణామూర్తి కావ్యాంతరంగం వైపు దృష్టినిలిపారు. "కథాకల్పనము, వర్ణనాదుల పొందిక రసానుగుణ్యము, భావనావక్తి, కవితాశక్తి మొదలగు కావ్యాంతరంగాంశములకు సంబంధించిన విచారము దక్షిణామూర్తిగారి పింగళిసూరనతో మొదలైనది. అనగా తెలుగులో సాహిత్యవిమర్శరీతియందు ఆధునికతావతరణమునకు రంగ నిర్మాణమును ఆరంభము చేసినది దక్షిణామూర్తిగారు. మరిపూర్తి చేసినది కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు"[4]

వెన్నేటి రామచంద్రరావుగారి "మనువసుచరిత్ర రచనా విమర్శనము' తులనాత్మక విమర్శరీతిలో జరిగినది,

తెలుగు సాహిత్యవిమర్శలో శాబ్దిక చర్చలు, అర్థచర్చలు పోయి కావ్య సమగ్రతవైపు దృష్టినిలిపిన పరిణామక్రమం స్థూలంగాయిది.

వీరేశలింగం గారి కాలంలోను, ఇరవైయవ శతాబ్దికి పూర్వం వచ్చిన విమర్శలు కావ్యాల్లో దోషచర్చలు, వ్యక్తిగత వైషమ్యాల కారణంగా జరిగిన వాదోపవాదాలుగా కన్పిస్తాయి. ఇందులో గ్రామ్య, గ్రాంధిక భాషావాదుల పరస్పర దూషణలు కూడా ఉన్నాయి. 1900 తరవాతవచ్చిన విమర్శల్లో ఆధునిక విమర్శనా ధోరణులకు మార్గదర్శకంగా నిలిచేవి ఉన్నాయి.

గురజాడ అప్పారావుగారి వ్యాసాలు సంస్కరణాభిలాషతో సృజనాత్మకతను పెంపొందించినవి. ఇవిముందు గ్రాంధికంలో ఉన్నా తరవాతవ్యావహారికంలోనే రాయడం మరోవిశేషం.

తెలుగులో పాశ్చాత్య పరిశోధనా పద్ధతులకు బ్రౌను తరవాత వీరేశలింగం గారు మొదలైనవారు ఎంతగానో కృషిచేశారన్నది స్పష్టం. కావ్యానుశీలన, కావ్యవివేచనల దిశలో విమర్శకుల దృష్టి మరలడం పందొమ్మిదో శతాబ్ది చివరిభాగంలోనే. దీనిని సమగ్రంగా ప్రకటించింది కట్టమంచి రామలింగారెడ్డిగారి ''కవిత్వతత్త్వవిచారము''. పేరులోను, పంథాలోను నవ్యతను సంతరించుకున్న విమర్శ ఇది. దీనిలో ప్రాచ్యసంస్కారము, పాశ్చాత్యప్రభావం భావావేశానికి అక్షరరూపం కల్పించాయి. సాంప్రదాయిక ధోరణిలో జరిగే ఆలంకారిక, గుణ, దోష నిర్ణయాలు తగ్గి కావ్యతత్త్వ వివేచన, అనుశీలన పెంపొందడానికి కవిత్వతత్త్వవిచారం బాట వేసింది.

కట్టమంచి రామలింగారెడ్డిగారిపై పాశ్చాత్య కాల్పనికోద్యమ ప్రభావం అధికం సాహిత్యంలో సాంప్రదాయిక ప్రమాణాలకు స్వస్తిచెప్పి కవితలోను, విమర్శలోను నూతనభావాలను స్వీకరించడం ఈ యుగ విశిష్టలక్షణం కాల్పనికకవులు కవిత్వంలో 'భావనాశక్తి'కి అధికప్రాధాన్యాన్నిచ్చారు.

సహజమైన భాషే కవితకు అలంకారం అని నమ్మారు. పల్లెపట్టుల రమణీయ దృశ్యాలవైపు దృష్టి సారించారు. మానవజీవితానికి, ప్రకృతికి అవినాభావ సంబంధం ఉందని భావించారు.

కాల్పనిక విమర్శకూడా ఇదే లక్ష్యాలతో ప్రారంభమైంది. దీనికి నేపథ్యంలో జర్మనుల సౌందర్యతత్త్వదృక్పథం మార్గదర్శకత్వం వహించింది. కావ్యవిమర్శలో ప్రాచీనులు నిర్దేశించిన మార్గాన్ని, సంప్రదాయాలను పీఢ

విడిచిపెట్టారు. కావ్యానుశీలనలో స్వేచ్ఛను ప్రకటించుకున్నారు కవితకు ప్రథమ ప్రయోజనం ఆనందాన్ని కలిగించడమని కాల్పనిక విమర్శకులు భావించారు.

కాల్పనిక విమర్శకుల్లో అభిరుచిని వ్యక్తీకరించే ధోరణి ప్రధానమై విమర్శలో ఆత్మాశ్రయ దృష్టి ప్రబలింది. కొందరు విమర్శలో తాత్త్విక పరిశీలనకు కూడా స్థానం కల్పించారు.

కట్టమంచి రామలింగారెడ్డిగారు కూడా ఇదే విధమైన అభిప్రాయాలనే తమ కవిత్వతత్త్వ విచారంలో వ్యక్తంచేశారు. "మనసు చెలరేగినప్పుడు ఆలోచనకు బూనుట యౌచిత్య భంగమునకు ముఖ్యకారణము" (క. త. వి పు26). ఇది వర్డ్స్‌వర్త్ చెప్పిన కవిత్వనిర్వచన ప్రభావమేనని స్పష్టమవుతోంది.[6]

కవిత్వంలో అలంకారాలను, సమాసభూయిష్ఠరచనను నిరసించారు. ప్రబంధాలు ఎండిన కట్టెలవంటి స్త్రీపురుషులకు ఆలవాలాలని దుయ్యబట్టారు. కావ్యాన్ని శృంగారరస ప్రధానంగాచేయడం కంటె మిశ్రరసాశ్రయంగా చేయడం ఉత్తమం అని అభిప్రాయపడ్డారు. ప్రబంధకవులు సృష్టించిన స్త్రీపాత్రలు వ్యక్తిత్వశూన్యాలని దానికి కారణమైన సాంఘిక స్థితిగతులను చర్చించారు. నాయికా నాయకులను చలనంలేని జడ ప్రాయులుగా చిత్రీకరించడం పాత్ర చిత్రణలోని దోషంగా భావించారు. గుణాగుణాలు మానవసహజం కాబట్టి మిశ్ర గుణ శోభితమైన పాత్రల్ని తీర్చడం ఔచిత్యం అన్నారు. ఈ విషయంలో పాశ్చాత్యుల దృష్టిని మెచ్చుకున్నారు.

భావనా శక్తిలేక అనవసరమైన వర్ణనలు, అనౌచిత్యం తోకూడిన శబ్దాలంకారాలు కవితలో గుప్పించడంవల్ల పాండిత్యం ప్రదర్శితమవుతుంది. కాని కవితరాణించదు అనిచెప్పారు. రెడ్డిగారి వ్యక్తీకరణలో తీవ్రత తప్ప విమర్శలో సంప్రదాయధోరణులనే పాటించారని విమర్శకుల అభిప్రాయం.[9] అయితే కవిత్వతత్త్వవిచారం అసలు చేసిందేమిటి? ఇంతదుమారం ఎందుకుచెలరేగింది? అని ఆలోచిస్తే— సంప్రదాయాన్ని ఉన్నదున్నట్లుగా నెత్తిన పెట్టుకుని కొలవలేని వ్యక్తిత్వం కట్టమంచిది. అందువల్ల నచ్చని విషయాలను, అనౌచిత్యాలనిపించినవాటిని తిరస్కరించారు. గతాన్ని సమీక్షించి మంచిచెడ్డలు వివేచించి నేటిమార్గాన్ని నిర్దేశించారు. ఇదే అతినవ్యంగా భావించి నచ్చినవారు మెచ్చుకున్నారు నచ్చనివారు దుయ్యబట్టారు.

పాశ్చాత్య సాహిత్యంలోగాని, కళలలోగాని జరిగినమార్పులన్నీ సౌంద. ర్యదృష్టితో ఏర్పడినవే. కావ్యసౌందర్య దృక్పథం వైపుసాగిన జిజ్ఞాస కాల్ప నికవాదంలోని విశిష్టత. దీనిని ప్రేరణగా గ్రహించిన తెలుగుసాహిత్య విమ ర్శలోను తరవాత వచ్చినదీ ప్రస్థానమే.

మూడు

# సాహిత్య సౌందర్య తత్త్వ దృక్పథము

తెలుగు సాహిత్యవిమర్శకు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చేసినసేవను పలువురువిమర్శకులు ప్రశంసించారు. ఆయన శైలిని,సరసమైన అభివ్యక్తిని అనుకరించడం అసాధ్యమని అంగీకరించారు. ఇంచుమించుగా తెలుగుసాహిత్యంలో వెలసిన అన్నిప్రక్రియలనూ ఆయనచేపట్టారు. తెలుగు,సంస్కృతాల్లో కవితలల్లారు. ప్రాకృతం నుంచి గాథాస ప్తశతిని ఆంధ్రీకరించారు. సాహిత్యంలో వెలసిన అన్నిప్రక్రియలకూ పీఠికలు రాశారు. సాహిత్యంలో ఆయనచేపట్టిన ప్రక్రియలన్నిటిలోను ఆయన విమర్శలకే సహృదయులు స్పందించారు.

రాళ్ళపల్లి సాహిత్యంలో అన్నిరకాలప్రక్రియలను చేపట్టినట్లుగానే, విమర్శలో కూడా ఏ ఒక్క ప్రక్రియను పిడిచిపెట్టలేదు. కొన్నికావ్యాలను అనుశీలనాత్మకంగా వివేచించారు. అభిరుచి విమర్శకులుగా జనరంజకధోరణిలో మరికొన్ని వ్యాసాలురచించారు. 'పాత్రచిత్రీకరణ' విధానంపై ప్రాచ్య, పాశ్చాత్య దృక్పథాల సమన్వయాన్ని ప్రకటించారు. లలితకళలను వినూత్న దృక్పథంతో వివేచించి, స్వరూపస్వభావాలను చర్చించి విమర్శకు సరికొత్త అలంకారాల్ని సమకూర్చారు. సంయమనశీలంతో నాటకలక్షణాలను చర్చించి ప్రాశ్చ పాశ్చాత్యలక్షణాల మేలుకీళ్ళను పఠితలముందుంచారు. వివిధకావ్య, గ్రంథ పరిష్కరణల విషయంలోను, పరిష్కరించిన గ్రంథాలకు పీఠికారచన చేయడంలో తమ పరిశోధనా దృక్పథాన్ని వ్యక్తీకరించారు.

వీరి 'వేమన' కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శ. కవికీ, సమకాలీన సామాజిక, ఆర్థిక, మత పరిస్థితులకూ, కావ్యానికి ఉన్నసంబంధ బాంధవ్యాలను దీనిలో తర్కసహితంగా వివరించారు.

రాళ్ళపల్లివారి సాహిత్యసేవను, విమర్శకవ్యక్తిత్వాన్ని సాహితీ ప్రముఖులంతా శ్లాఘించారు.

"శ్రీశర్మగారు సాహిత్యవిమర్శ కొఱకు చేసిన తపస్సు చాల తీవ్రమైనది. తత్తఫఃఫలము వారనుభవించి లోకమున కందించిరి.[1] అని బెఝ్వారి శ్రీని

వాసమూర్తిగారు,

శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారుత్తమ పరిశీలనకును మృదు మధుర వచనశైలికిని పేరుపడిన పండితవిమర్శకులు"[2] అని దివాకర్ల వెంకటావధానిగారు,

"ఈ పద్యము హృద్యముగా నున్నది. ఈ భావము రయణీయముగా నున్నది— ఇత్యాది గతానుగతిక వైతాళిక ఘోష విమర్శన వేషముతో సంచారము చేయుట సహింపరానిది. మన విమర్శకులదృక్పథము మంచి దారులకు జేరబెట్టిన రాళ్ళపల్లివారి మేలు మఱవరానిది"[3] అని మధునాపంతులవారు

"విమర్శకి ఎన్నిహంగులు ఉండాలో అవన్నీ అనంతంగా అనంతకృష్ణశర్మ రూపేణా కూడగట్టుకున్నాయి"[4] అని యామిజాల పద్మనాభస్వామిగారు, "శర్మగారి పరిశీలన సౌందర్యములోతులు వెదకునది. బర్కు మహాశయు డన్నట్లు కేవలము Beautyతోనే తృప్తిపడక sublimity వరకు దూకి యా చీకటిగుహలోగిలి గభీరతలో తన కందరాని యేదో ప్రభాతారుణ మధురమగు నిత్యవర్చస్వియగు తపఃఫలమున కాయన ప్రాకులాడుచుండును"[5] అనిపుట్టపర్తి నారాయణాచార్యులుగారు

"రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ విమర్శకుని లక్ష్యాలలో చిత్తసంస్కార మనేదాన్ని ఉన్నతస్థానాన నిలిపేలాగున విమర్శకు తీర్చిదిద్ది దానినొక కళగా భావింపచేసిన ఘనుడు"[6] అనిరమణారెడ్డిగారు

"శర్మగారిదొక విశిష్టసాహిత్య ప్రస్థానము"[7] అని సాళ్వకృష్ణమూర్తి గారు శర్మగారి విమర్శ వ్యక్తిత్వాన్ని సమీక్షించారు.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తెలుగు సాహిత్య విమర్శకు అందించిన తపఃఫలమేమిటి? ఆయన చేసిన మేలేమిటి? కూర్చిన హంగులేమిటి? సాగించినప్రస్థానమేమిటి? అనిఆలోచిస్తే—

సమకాలీన దృక్పథాలు తనకు సరిపడనపుడు నూత్నమార్గాలు అనుసరించడం ఎక్కడైనా జరిగేదే. దానికి వెనుదీయక ప్రభావంలో మునిగిపోక తనసంస్కారాన్ని సమన్వయంతో నిలుపుకొన్నపుడే వ్యక్తిత్వంలోని ప్రత్యేకత నిలుస్తుంది. సమకాలిన విమర్శమార్గాన్ని కట్టమంచి కవిత్వతత్త్వ విచారము 'వైపు' మరలించారు. సమన్వయంతో రాళ్ళపల్లి మరో అడుగు ముందుకువేసి "కవిత్వసౌందర్య తత్త్వ విచారము" వైపు ప్రయాణంచేశారు.

ఈ ప్రయాణంలో ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయ సమన్వయం కొన్నిచోట్ల, విభేదించడం మరికొన్నిచోట్ల కన్పిస్తుంది.

ఆంగ్ల సాహిత్యం ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలను ప్రభావితం చేసింది. ఆ విధంగానే ఆంగ్ల సాహిత్యంలో నూతనంగా వస్తున్న విమర్శ దృక్పథాలు కూడ ఆంధ్ర విమర్శకులకు మార్గదర్శకాలుగా నిలిచాయి. ఇదిపూర్తిగా ప్రభావం అనుకోవడానికిలేదు. ప్రభావానికి లోను కావడం వేరు ప్రభావస్ఫూర్తితో స్వతంత్రంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవడం, మార్గంవేయడం వేరు. కట్టమంచిలో ప్రాచ్య సంస్కారం మరుగునపడి పాశ్చాత్య ప్రభావం ప్రముఖంగా కన్పిస్తుంది. రాళ్ళపల్లిది ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయాలు రెంటినీ తన దృక్పథంతో సమన్వయించుకొన్న విమర్శ.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఉపయోగించే 'రస' శబ్దం పాశ్చాత్య సౌందర్యదర్శన దృక్పథంయొక్క అవగాహన ద్వారానే అని జి. వి. సుబ్రహ్మణ్యంచెప్పారు[8].

రాళ్ళపల్లివారు చెప్పిన రస నిర్వచనమిది:

"రసమనగా మనలాక్షణికులు నియమించినట్లు, శృంగారము మొదలగు తొమ్మిది భేదములే కలిగి యలౌకిక చర్వణా విషయమగు నొక వివరింపరాని పదార్థమని నాయుద్దేశముగాదు. తర్కశాస్త్ర పరాధీనులగు మన లాక్షణికులు వాదవివాదములను బెంచి యెవరో వ్రాసిన రస లక్షణములనే స్థాపింపబూని రసశబ్దమునకు మార్గమును సంకోచపరిచిరని నాయభిప్రాయము...... ఏభావములైనను వాని తీక్ష్ణదశలో నవిదిత వేద్యాంతరముగా ననుభవింప గల్గుదుమేని యానందస్వరూపులై రసశబ్దవాచ్యములగును; అనగా శిల్పమందన్న మాట. జుగుప్సా భక్తి వాత్సల్యాదులు గూడ రసములే యని వాదించువారు మనలోలేకపోలేదు. తర్కశాస్త్రము నోరు మూసినను హృదయమును మూయజాలదు. కావున కవిభావనా బలముచే తనకుగలుగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావములనబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి, విగ్రహమును (ఏవిగ్రహమైనను సరియే) సరళమగు భాషతో, తీర్చియెదుట నిలిపినపుడు రసానుభవ సంస్కారముగల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి అవి

యెట్టిదైనను, శిల్పమందుగల ఒకానొక అనిర్వచనీయ మహిమచే, ఆనంద ముగా, బరిణమించును. ఈ యర్థమందే ప్రకృతము రసపదమును నేనుపయోగించెదను." (సారస్వతాలోకము. పుట 117-118)

కావ్యంలో లెక్కప్రకారం ఉండాలనుకున్న వర్ణనలు, శబ్దచమత్కారాలు ఉంటేరసానందం కలుగదని, లాక్షణికులు చెప్పిన రసభేదాలే ఉండాలని కాని రాళ్ళపల్లి అభిప్రాయంకాదు. ఏభావాన్నయినా సహృదయుడు ఉచ్ఛ స్థితిలో అనుభవించగలిగితే అదే రసానందమని ఆయన అభిప్రాయం. ఈరస నిర్వచనం సాహిత్య సౌందర్యమీమాంసకు వీరెంతటి ప్రాధాన్యాన్నిచ్చారో స్పష్టంచేస్తోంది.

ఈ నిర్వచనం రాళ్ళపల్లి స్వతంత్ర విమర్శనా విధానానికి నిదర్శనం. మనసు అనుభవించని దానిని ఆయన అంగీకరించలేరు. పెద్దలు చెప్పిన వాక్యాలుకదా అని శిరసున ధరించరు. సౌందర్యమీమాంసకు రాళ్ళపల్లి వేసిన మొదటి మెట్టు ఈ రసనిర్వచనం. దీనిలో పాశ్చాత్య సాహిత్య సౌందర్యమీమాంస ప్రభావమూకన్పిస్తుంది. రాళ్ళపల్లి స్వతంత్రదృక్పథమూ వ్యక్తమౌతోంది.

కళకు ప్రత్యేక ప్రయోజనమున్నదని దానిని సాధించటానికి ఏకాగ్రత అవసరమని చెప్పారు.

"కళకు అనుకరణము సాధనము. సాధ్యము చిత్తైకాగ్రత. దాని ఫలము శాంతి...... శాంతియనగా సోమరితనము కాదు, ఏకాగ్రత. అవిదిత వేద్యాంతరముగా ఏదేనియొక వస్తువునందు చిత్తము నిల్పగలుగుట"
(నాటకోపన్యాసములు. పుట. 13)

ఈభావం పాశ్చాత్య ప్రభావజనితమనిపించినా[9] దీనికి భారతీయ లాక్షణికుల అభిప్రాయాలే ప్రేరణలు.

కావ్యమీమాంస చతుర్థాధ్యాయంలో.
"కావ్యకర్మణి కవేః సమాధిః పరం వ్యాప్రియతే" ఇతిశ్యామదేవః
మనస ఏకాగ్రతా సమాధిః సమాహితం చిత్త మర్థాన్ పశ్యతి.
"..........
..........

తత్సిద్ధయే పరమయం పరమోఽభ్యుపాయ:
యచ్చేతసోవిదిత వేద్యవిధేః సమాధిః"[10]

అనిఉంది. రాళ్ళపల్లి చెప్పిన 'శాంతి', శ్యామదేవుని 'సమాధి' ఏకార్థ బోధకాలుగా భావించవచ్చు.

భావ, వస్తు, రచనా కళలను గూర్చి చెప్పిన అభిప్రాయాలలో అక్కడక్కడ ప్రాచ్య, పాశ్చాత్య అభిప్రాయాల సమన్వయధోరణి కనిపిస్తుంది.

ప్రాచ్యలాక్షణికులు చెప్పిన భావయిత్రి ప్రతిభను భావకళగా చెప్పడం భావాభివ్యక్తికి సౌందర్యస్ఫూర్తిని కల్గించడానికే. ''భావములు ప్రాణి ధర్మములు. భావములతో నేమాత్రము సంబంధములేని వట్టి పదార్థముల కూర్పు ఎండిన వరగు గంప కెత్తినట్లుండును." (సారస్వతాలోకము. పుట 53.) అని చెప్పడంలో కూడా రాజశేఖరుని వాక్యాలు నిగూఢంగా కన్పిస్తాయి.

"ప్రతిభా తారతమ్యేన ప్రతిష్టా భువిభూరిధా
భావకస్తు కవిః ప్రాయోన భజత్యధమాందశామ్"

లలితకళలకు అన్నింటికి సమన్వయాన్ని కల్పించి సమీక్షించడం పాశ్చాత్య పద్ధతి.[12] నాటకోపన్యాసములలో రాళ్ళపల్లి వారు చేసిన లలితకళావివేచన పాశ్చాత్య విధానమే

కళకు అనుకరణము ప్రధానధర్మమని ఆ అనుకరణము ఔచిత్య పూర్వకముగా చేయుటకు ఇతర లలితకళల సహాయ మవసరమని,[13] చెప్పడం వలన లలితకళలు ఒకదాని కొకటి సహాయకారిగా నున్నపుడే కళకు నిండుదనమని భావించినట్లు తెలుస్తుంది.

"ఒక వస్తువునందలి భిన్నభాగముల వేర్పాటు శాస్త్రము. భిన్న పదార్థముల నొకచోట (జేర్చి చేయు కూర్పుకళ.'' (నాటకోపన్యాసములు. పుట 4.) అని చెప్పడం కూడా పై అభిప్రాయాన్ని స్పష్టం చేస్తోంది.

వివేక ప్రధానమైన విమర్శనా దృష్టికంటె, హృదయమును నమ్మిన అనుభవరసికుల దష్టికి కళా వివేచనలో స్థానం కల్పించారు.[14]

వివేకదృష్టి ప్రబలితే కళలో పరిపూర్ణతకు భంగం కలుగుతుంది అని కూడా స్పష్టం చేశారు. అనుభవాన్ని ప్రమాణంగా గ్రహించి కళావివేచన చేయాలని భావించారు.

1912 లో "కవిత" [15] అనే వ్యాసాన్ని రచించారు. దీనిలో చక్కని కవిత రాయడానికి కావలసిన నాల్గులక్షణాలు చెప్పారు. అవి: 1. చక్కని సాహితి 2. ఛందశ్శాస్త్రమున జ్ఞానము 3. ఔచిత్యము 4. సారళ్యము.

1. ఏభాషలో కవిత చెబితే ఆభాషలో శబ్దజ్ఞానము తప్పనిసరిగా ఉండాలి.
2. పద్యకవులు ముఖ్యముగా గమనింపవలసినది ఛందస్సు. భాషలో కూలంకష జ్ఞానము ద్వారానే ఇది సాధ్యమవుతుంది.
3. కాల, పాత్ర ఔచిత్యాలను గమనించి కవిత చెప్పాలి.
4. అన్వయ కాఠిన్యం లేకుండా ఉండాలి. సారళ్యమే కవితకు ప్రాణం.

రాళ్ళపల్లి చెప్పిన ఈ నాల్గులక్షణాలు గమనిస్తే స్థూలంగా ప్రబంధ కవిత్వంలోని గుణదోషాలను చర్చించినట్లు తెలుస్తుంది. ఇవే అభిప్రాయాలను నాచన సోమన కవిత్వాన్ని వివేచిస్తున్నపుడు మార్గదర్శకాలుగా గ్రహించి ఉంటారని భావించవచ్చు.

కళాప్రయోజనాన్ని ఆనందస్వరూపాన్ని రాళ్లపల్లి స్పష్టంగా చెప్పారు.

"ఆనందమనగా సుఖముకాదు. సుఖము ఇంద్రియములకు సంబంధించినది. ఆనందము ఆధ్యాత్మికము అనగా ఆత్మకెక్కువ సంబంధించినది ..... సుఖము ఆనందము యొక్క మితస్వరూపము మఱియు చంచలము. సుఖమే దు:ఖమునూ అగును. ఆనందమట్టిది కాదు. సంపాదించు కొనగలది అనుభవింప వచ్చును. అనుభవించుకొలది ఆశలూరును. అమేయమగును."[16]

కళాభిమతము సుఖమని కట్టమంచి రామలింగారెడ్డి చెప్పారు[17]. రాళ్ళపల్లి పైన చెప్పిన ఆనందస్వరూపం వీరిరువురి విమర్శదృక్పథాల్లో గల తేడాను స్పష్టంచేస్తుంది. When we seek aesthetic pleasures we have no further pleasure in mind"[18] అనే జార్జి శాంతాయన మాటలతో పోలికకూడ కన్పిస్తుంది.

ప్రాచ్యపాశ్చాత్య సంప్రదాయ పరిజ్ఞానంతో రాళ్ళపల్లి చేసినకృషిని సమీక్షిస్తూ "భారతీయ సంస్కారంలో పాశ్చాత్య ఫణుతులను సమీక్షించి ప్రాచ్యపాశ్చాత్య సమన్వయాత్మకమైన ఫణితిని తెలుగుదనం ఉట్టిపడేటట్లు ప్రవర్తింప చేసిన విమర్శకద్వయం రాళ్ళపల్లి, దువ్వూరి. రాళ్ళపల్లి...... ఆంగ్ల కాల్పనిక కాలంలో ప్రవృద్ధమాన మౌతున్న సాహిత్య సౌందర్య

మీమాంస (Litery Aesthetics)ను తెలుగులోకి తీసికొని రావటానికి యత్నించారు. అని జి. వి. సుబ్రహ్మణ్యం చెప్పారు.

ఈసౌందర్య మీమాంస దృక్పథం జర్మనుల తాత్త్విక దృక్పథం నుంచి ప్రభావాన్ని పొందింది ఆంగ్లసాహిత్యంలోకాల్పనికయుగంలో ఈ దృక్పథానికి అధిక ప్రచారం లభించింది. అభివ్యక్తిలోని విశిష్టతను వివేచించి కళాసూత్రాల సమన్వయం చేసి చూపడం సౌందర్య మీమాంసకు మూలం.

కాల్పనిక యుగంలో వచ్చిన విమర్శ చాలా వరకు అభిరుచి విమర్శ (Impressionistic Criticism). ఆలంకారిక ప్రమాణాలతో కాకుండా కావ్యార్థ సమన్వయానికి విమర్శకుడు తన అనుభవం ద్వారా కొన్ని సూత్రాల నేర్పరచుకొని వాని ననుసరించి కావ్యానుశీలనం చేస్తాడు దీనిలో అతడు పొందిన అనుభవానికి, దాని అభివ్యక్తికి మాత్రమే విశేషమైన ప్రాధాన్యం ఉంది ఇది 'కళ కళకొరకే' అనే సిద్ధాంతం నుంచి వ్యాప్తిలో కొచ్చింది కావ్య పఠనం ద్వారా పొందిన అనుభవాన్ని, తత్త్వాన్ని యథాతథంగా వ్యక్తీకరించ టమే అభిరుచి విమర్శ, కవిత చదివినప్పటి సహృదయుని స్పందననే ప్రమాణంగా గ్రహిస్తారు. "Expression is Beauty" అనేదానికి విలువనిస్తారు. కావ్యానుశీలానికి తోడ్పడే కావ్యసౌందర్య సూత్రాలను తామే ఏర్పరచు కొంటారు.

కావ్యంలో సహృదయుని అభిరుచిని ఆకర్షించే విషయాలే విమర్శలో సౌందర్యాభివ్యక్తికి స్థానాన్ని కల్పిస్తాయి. అభిరుచి విమర్శే కాలక్రమంలో గుణాధిక్యం వల్ల కావ్యసౌందర్య తత్త్వవివేచనం (Aesthetic Criticism) గా సాగింది.

కాల్పనిక యుగకవుల విమర్శనా ధోరణులను పరిశీలిస్తే సౌందర్య తత్వ మీమాంస ప్రభావ స్వభావాన్ని తెలుసుకోడానికి వీలుంటుంది [20]

కాల్పనిక యుగకవుల్లో వర్డ్స్‌వర్త్, కోల్‌రిడ్జి, షెల్లీ, కీట్సు, హాజ్‌లిట్ ప్రముఖులు. భావనాశక్తికి వీరు కల్పించిన ప్రాధాన్యం, విమర్శలలో కన్పించే సౌందర్య చింతన పరిశీలిస్తే వీరి విమర్శదృక్పథం స్పష్టమవుతుంది.

వర్డ్స్‌వర్త్ కవి హృదయంనుంచి వెలువడిన భావోద్రేకమే కవిత అని చెప్పాడు కవి భావనా శక్తిద్వారా పొందిన అనుభవాన్ని వ్యక్తీకరించడం ముఖ్యం. ప్రతిభావంతుడైన కవి స్వతః సిద్ధమైన కవితాధారతో వ్యక్తీకరించే

భావం కలకాలం నిలుస్తుంది. మంచికవిత ఆలోచనద్వారాను కవిపొందిన భావ నలు ఆకృతిగా రూపొందడం ద్వారాను ఉద్భవిస్తుంది. భావనాశక్తి (imagination) కవిత్వానికి సమగ్రతను కల్పిస్తుందని, ఊహాచమత్కారం (Fancy) తాత్కాలికానందాన్ని కలిగిస్తుందని భావించాడు. ఈతని విమర్శలు ఆవేశప్రధానంగా, ఆత్మాశ్రయంగా సాగాయి.

జర్మన్ తాత్త్విక దృక్పథప్రభావం కోలరిడ్జి మీద ఎక్కువగ కనిపిస్తుంది ఇతని విమర్శలో ఆవేశంకాక ఆలోచన ప్రధానంగా కనిపిస్తుంది. భావనాశక్తికి, ఊహాచమత్కారానికి భేదాన్ని చెప్పడం తాత్త్వచింతనకు మూలమని చెప్పవచ్చును.

"Good sense is the Body of the Poetic Genius, Fancy its Drapery, Motion its life and Imagination the soul that is every where, and in each, and forms all into one graceful and intelligent whole"

గాఢ భావనము, తత్త్వదర్శనము ముఖ్యమని భావించడం సౌందర్యమీమాంసకు మొదటిమెట్టుగా గుర్తింపవచ్చు.

'కవిత్వం సహృదయులు స్పందనతో పంచుకొన్న ఆనందక్షణాల రికార్డు వంటిదని, సమగ్రమైన జ్ఞానమని, సమాహార శాస్త్రమని షెల్లీ చెప్పాడు. లోకంలో కళావిర్భావానికి కవులు కారకులని చెప్పాడు భావనకు, అభివ్యక్తికి గలసంబంధాన్ని కవిత్వంలో నిగూఢంగా సంచరించే నీతినిగూర్చి చర్చించాడు.

కీట్స్ జగమెరిగిన సౌందర్యారాధకుడు 'Beauty is truth, truth is Beuaty-అని చెప్పాడు.

హాజ్‌లిట్ కావ్యవిమర్శలో కవిని, అతని జీవితాన్ని గురించి పట్టించుకోలేదు. విషయదూరమైన విమర్శ చేయలేదు. కావ్యాన్ని చదివినప్పుడు కలిగిన అనుభవాన్ని స్పష్టంగా సూటిగా వ్యక్తీకరించాడు. కాల్పనిక యుగ విమర్శకుడిగా పేరొందినా ప్రాచీన ఆధునిక కవిత్వాల్ని సమన్వయాత్మకంగా అనుశీలించాడు.

"భావనాశక్తి వస్తువును ఉన్నదున్నట్టుగా వ్యక్తీకరించదు. కవిప్రతిభ ద్వారా, ఆ సమయంలో కవిపొందిన అనుభూతుల సమాహార రూపంగా, అత్యంత రమణీయంగా వ్యక్తీకరిస్తుంది" అని చెప్పాడు.

ఇతనిది అభిరుచి విమర్శ. పాఠకుని అనుభవమే కావ్యానుశీలనానికి ముఖ్యం. కాని ఇతరమైన ప్రమాణాలు కావని స్పష్టంచేశాడు.

సౌందర్య మీమాంస ప్రస్థానంలో సాగిన పాశ్చాత్య విమర్శకులలో కోల్‌రిడ్జి, జార్జిశాంతాయన (1863-1952) మొదలైన వారి ప్రభావం రాళ్ళపల్లి వారి స్థూలంగా కనబడుతుంది అని జి.వి. సుబ్రహ్మణ్యం చెప్పారు.[21]

ఈ సౌందర్య శాస్త్రానికి మూలం తత్త్వశాస్త్రం. క్రమంగా తత్త్వశాస్త్రం నుంచి విడివడి ''ఈస్థటిక్స్'' స్వతంత్ర ప్రతిపత్తితో కావ్య సౌందర్యాన్ని వివేచించి తెలిపే శాస్త్రంగా రూపొందింది. పురాణం సూరిశాస్త్రి గారు ఈ సౌందర్య శాస్త్రాన్ని గూర్చి సంక్షిప్త పరిచయం చేశారు.

''సౌందర్యము యొక్క స్వభావ స్వరూపములను, రసతత్వమును నిర్ణయించెడి శాస్త్రము ఈస్థటిక్స్ అనబడును. రుచిభేదము లెందున జనించు నదియు, లలితకళల మూలసూత్రము లెవ్వియైనదియు గూడ నీ శాస్త్రము విచారించుచున్నది. గ్రీకు భాషలో ఈస్థటిక్స్ అను పదమునకు ఇంద్రియము లచే గ్రహించుట, తెలిసికొనుట అను వ్యుత్పత్త్యర్థ మొప్పుచున్నది. వస్తు సౌందర్యమును మనసా చింతించి (కాంటెంప్లేటుచేసి) రసానందమనుభవించు టకు ఈ పదము బామ్‌గార్టెనుచే వ్యాపింపజేయబడినది. ఇంద్రియ గ్రాహ్యమగు విషయములను చింతించుటలో ప్రీతిని, ఆనందమును చవిజూచు మానస వ్యాపారముల నీశాస్త్రము పరిశోధించుచున్నది. ఇంద్రియ ద్వారమున నవబోధమగు సంగతి సందర్భములన్నియు విషయములన జెల్లును. ప్రకృతి వైచిత్ర్యములు, ప్రియదర్శనంబులు, చిత్రశిల్పాదులు ప్రత్యక్షముగ కన్నులగట్టి రససౌందర్య చింతనేర్పరచును సంగీతమిటులనే ప్రత్యక్షముగ శ్రవణేంద్రియమునుదాకి, రసధ్యానమేర్పరచును. కావ్యపరనమిట్టి సౌందర్య విచారణను బురికొల్పుచున్నను కావ్యనిర్దిష్టములగు విషయములు ప్రత్యక్షములుగ నింద్రియములకు గోచరింపవు. పదములకును, భావములకును, వస్తువులకును మన్నించి, మానసకోశమాపదములు నిరూపించెడి విషయములను మానస వీధిలోనగుపడునట్లు చేయును. ఇట్లు సాక్షాత్కరించిన విషయచ్ఛాయలను జింతించుచు రసానంద మనుభవించు చున్నాము అందుచే కావ్య పఠనము వలన జనించెడి రసయోగము వ్యంగ్య ప్రభూతమై పదసూచితమై

ప్రత్యక్షేతరముగ నుండును. తక్కువగల లలితకళలు సూటిగ నింద్రియ గ్రాహ్యములై సౌందర్య సూచనలందించుచున్నవి."

"మన చిత్తమొక విషయముపై చూపినిలిపి దానిని సంతోషముగ నుత్సాహముగ జింతింప మొదలిడు నప్పుడు మన మానసము రసయోగమ ధిష్ఠించెనని చెప్పవచ్చును. (ఈస్థటిక్ యాటిట్యూడ్.) ఇట్టి యవస్థలో మన మనుభవించెడి మానస వ్యాపార విశేషములు రసానుభవమనబడు చున్నవి. రససౌందర్య విరాజితంబులగు విషయముల జింతించునపుడెల్ల ప్రీతియే, ఆనందమే, సంతోషమే గలుగుచుండును. ఇట్టి రసానందమనుభవించెడి సమయములందు మన శక్తియుక్తులు పెల్లుబ్బి, జీవసంచలన వికాస మొందుచుండును. మన రాగద్వేషములు, భావోద్రేకములు చల్లబడి యొక విధమగు సాధుత్వమొందును. మానస మనిర్వచనీయ సంతోష తేజః పుంజమున సంకల్ప హీనమై నిశ్చల సంతుష్టితో దేలుచుండును. ... "రసానుభవము నిస్సంగ మానసయోగము' స్వార్థా పేక్ష లేనిది."[22]

జార్జి శాంతాయన తన 'Sense of beauty' అనే గ్రంథంలో కూడ సౌందర్య స్వరూప స్వభావాల్ని గూర్చి చర్చించాడు, ఇంద్రియాలు అనుభవించే సౌందర్యం కళా సౌందర్యాను భవానికి మూలం. అభిరుచి ఇంద్రియాల అనుభవ మూలంగానే ఏర్పడుంది. శాంతాయన సౌందర్య స్వరూప స్వభావాలను ఈ విధంగా విశ్లేషించాడు.

1. Nature of the beauty 2. Form 3. Expression... Beauty is constituted by the objectification of pleasure. It is pleasure objeetified."[23] అని చెప్పాడు.

కావ్యంలో ఏక సూత్రతను సాధించడం, భిన్నవిషయాలు దృక్పథాల మధ్య సమన్వయం చేయడం, సంశయ నివృత్తి, సౌందర్య స్వరూపావిష్కరణకు దోహదం చేస్తాయి. అభివ్యక్తి, విషయంలో ఉన్న గుణాలల్లో సౌందర్యాన్ని ఎక్కువచేసి చూపుతుంది. లేదా వాటికో నూత్న సమన్వయాన్ని చేస్తుంది. కావ్యంలో ప్రతీకలు చేసే విషయావిష్కరణ కంటే అవిచెప్పే విధానంలోనే, అభివ్యక్తిలోనే సౌందర్యం వ్యక్తీకరించబడుతుంది. ఈ రకమైన అభివ్యక్తి వాదం (Expressionism) జీవకళయందు భావార్థములందు స్ఫురించే సౌందర్యమే ప్రధానం అని భావిస్తుంది. [24]

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి అభిప్రాయాలు చాలా వరకు అభి వ్యక్తి వాదాన్ని బలపరుస్తాయి. ఇది కాల్పనిక యుగ సాహిత్య ప్రభావమన వచ్చు.

కట్టమంచి రామలింగారెడ్డి పరిచయం వలన తనకు ఆంగ్ల సాహిత్య పరిచయం కలిగిందని రాళ్ళపల్లి వారే స్వయంగా చెప్పుకున్నారు.[25]

అంతేకాక మిత్రుల, సన్నిహితుల వాక్యాలద్వారా వారికి ఆంగ్లసాహిత్య పరిచయం, అవగాహన ఉందని స్పష్ట మవుతుంది.[26]

రాళ్ళపల్లి సౌందర్య తత్త్వ దృక్పథంతో కావ్యాల్ని అనుశీలిస్తూ వెలి బుచ్చిన అభిప్రాయాలకు, జార్జి శాంతాయన The sense of Beauty గ్రంథంలో వెలుబుచ్చిన అభిప్రాయాలకు సాదృశ్యం కనిపిస్తుంది.

1. "ఆనందమనగా సుఖము కాదు, సుఖము ఇంద్రియములకు సంబంధించినది. ఆనందము ఆధ్యాత్మికము అనగా ఆత్మకెక్కువ సంబంధించినది... సుఖము ఆనందముయొక్క మిత స్వరూపము మఱియు చంచలము. సుఖమే దుఃఖమునూ అగును. ఆనంద మట్టిది కాదు. సంపాదించు కొనగలది అను భవింప వచ్చును. అనుభవించు కొలది ఆశలూరును అమేయమగును.

**When we seek aesthetic pleasures we have no further Pleasure in mind that we do not mix up the Satisfactions of vanity and proprietorship with the delight of contemplation.This is true, but it is true at bottom of all pursuits and enjoyments.Every real pleasure is in one sense disinterested. It is not sought with ulterior motives and what fills the mind is no calculation,but the image of an / object or event, suffused with emotion.**

2. కళావంతుని ధర్మమెల్ల తానేఱు కొన్న వస్తువుగాని, పాత్రముగాని మనకు హృదయంగ మగునంత తీవ్రతతో తయారు చేయుటయే కాని వేఱు కాదు. అట్టి పాత్రములు ప్రకృతిలోనున్నవాయను చర్చతో వానికంతగా పనిలేదు. ఉండ వచ్చునని తోచినను ఉండవలయునని బుద్ధి పుట్టినను, జాలును.

**He (poet) may know nothing of men he may have almost no experience; but his creations will pass for models of naturalness and for types of humanity.**

3 కళా సంసారమున నీతి తెరమఱుగు భాగ్యగానుండి పనిచేయ వలయు నేకాని ముందు పడి మొగము జూపి త్రోసికొనిరారాదు అట్లయినచో కళా సొగసు చెడును.

**The aesthetic world is limited in its scope, it must submit to the control of the organizing reason and not trespass upon more useful and holy ground.**

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అభివ్యక్తి (Expression) లో సౌందర్యాన్ని ఉత్తమంగా భావిస్తారు. కావ్యం కళా దృక్పథాన్ని వ్యక్తీకరిస్తుందని నమ్ముతారు. కావ్య వివేచనలో కూడ సౌందర్యాన్ని వ్యక్తీకరింప చేయడం వీరితోనే మొదలైంది. ఇది తరువాతి విమర్శకులకు మార్గదర్శకమైంది. కవిత్వంలో గుణ దోష నిర్ణయం చేస్తూ కవులు, విమర్శకులు ఉన్న కాలంలో రాళ్ళపల్లి విమర్శ కావ్యంలో గుణదోష చర్చలకు ప్రాధాన్యమీయక సౌందర్యాన్వేషణ సాగించి, విమర్శను కూడ కళగా, సౌందర్య మీమాంసా దృక్పంతో ముందుకు నడిపించింది.

"...ఉన్నది కొంత ఉండవచ్చునది కొంత, ఉండవలసినది

కొంత చూచి, ఊహించి, కల్పించి అనుకరించుట కళాధర్మము"

అని 'కళ' ఏ విధంగా ఉండాలో స్పష్టం చేశారు. ఏదయినా మితి మీరితే ఔచిత్య భంగమే నని నాటకోపన్యాసాలలో ఉదాహరణలతోసహా వివరించారు. కొన్ని చోట్ల పాశ్చాత్యుల కళా వివేచనా ధోరణులను మెచ్చుకున్నారు. స్వభావవాదుల అభిప్రాయాలను ఖండించారు. ఇవి అనౌచిత్యాలని కూడ స్పష్టం చేశారు.

సహృదయుడైన విమర్శకునకు ఉండవలసిన కళారాధన దృష్టి, సౌందర్య వివేచన, వివిధ శాస్త్ర పాండిత్యము కల రసిక విమర్శకులు రాళ్ళపల్లి. కవి హృదయాన్ని వ్యక్తపరచగల సహృదయ సంస్కారముంది. కావ్యార్థాన్ని సౌందర్య స్ఫూర్తితో సమన్వయించగల విమర్శనా పటిమఉంది.

నాలుగు

# రాళ్ళపల్లి విమర్శలు

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి విమర్శలు ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయాల అవగాహనలో తీర్చిదిద్దినట్టివి. చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా మనసులో నాటుకునేటట్టు చెప్పడం వీరి విమర్శల ప్రత్యేక లక్షణం.

''సారస్వత వ్యాసములు'', "నాటకోపన్యాసములు'', "వేమన" వివిధ గ్రంథాలకు రాసిన పీఠికలు శర్మగారి విమర్శలుగా గ్రహించవచ్చు. ఇవికాక సంగీతంపై రాసిన వివిధ వ్యాసాలు, పత్రికలలో ప్రచురితమయిన వ్యాసాలు (సారస్వతాలోకములో జేరనివి) కూడ అనుశీలనకు స్వీకరించడం జరిగింది.

సారస్వతవ్యాసాల్లో రంగనాథ రామాయణ కర్తృత్వ విషయాలు, నాచని సోమన, ఎఱ్ఱన కవిత్వాలను గూర్చిన చర్చలో భావ, వస్తు, రచనా కళలపై చెప్పిన అభిప్రాయాలు సిద్ధాంత వ్యక్తీకరణలు. తిక్కన్నగారి సీతమ్మ పాత్రపోషణ గూర్చిన మెలకువలు పాశ్చాత్య ప్రభావంతో చేసిన విమర్శ. గాయలనాటి సాహిత్యము, రసికత్వము విషయాలపై అభిరుచి ప్రకటన కనిపిస్తుంది.

'నాటకోపన్యాసములు' ధర్మవరం రామకృష్ణమాచార్యుల, కోలాచలం శ్రీనివాసరావుల స్మారకోత్సవసభలలో చేసిన ఉపన్యాసాలు. మొదటి ఉపన్యాసం లలితకళలను గూర్చి లక్షణ రూపంగా చెప్పింది. స్వభావవాద సిద్ధాంతాలకు కళా వివేచనలో స్థానంలేదని ఖండిస్తూ చెప్పిన అభిప్రాయాలున్నాయి లలిత కళల తారతమ్యాలను, నాటకంలో పద్యగేయాల ఔచిత్యాన్ని సహేతుకంగా పరిశీలించారు.నాటకాల్లో స్త్రీపాత్రలు స్త్రీలే ధరించాలి.' అనే స్వభావవాద సిద్ధాంతాన్ని మానవస్వభావం' నీతి అనే విషయాల ఆధారంగా ఖండించారు.

'వేమన'—ఇది కవి 'జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శగా గ్రహించవచ్చు. వేమన కవిత్వానికి, అతని జీవితానికి, మత, సామాజిక, ఆర్థిక పరిస్థితులకుగల సంబంధాన్ని దృష్టిలో పెట్టుకుని వేమన వ్యక్తిత్వాన్ని కవిత్వాన్ని అనుశీలించే యత్నమిది.

'పీఠికలు'— పరిచయాత్మకంగాను, అభినందన రూపంగాను ఉన్నవి కొన్ని. ఆయా ప్రత్యేక ప్రక్రియకు సంబంధించిన పూర్వాపరాలను భాగోగ్య

లను చర్చించినవి కొన్ని. ఇవి సునిశిత విమర్శనా దృష్టితో, సమకాలీన సాహిత్యాన్ని పఠితలకు పరిచయం చేసేవి.

'స్వభాషాభిమానమునకు సంగీతముతో నేమిగొడవ' "ఆంధ్రగాయక జన మహాసభాధ్యాక్షోపన్యాసము"[2]లలో సంగీతంలో ప్రాతీయ భేదాలుండ రాదని, సాహిత్యంకన్న నాదం సంగీతానికి ఎక్కువ అవశ్యకమైనదని, సాహిత్యాన్ని అర్థం కాకుండా చేసే సంగీతం ఆస్వాదయోగ్యం కాదని చెప్పారు.

సారస్వత వ్యాసాలను ఒక్కొక్కదానిని పరిశీలించడం వలన ఏ విషయాన్ని ఏదృష్టితో పరిశీలించారు అనేది స్పష్టమవుతుంది. రాళ్ళపల్లిది ప్రధానంగా సౌదర్యతత్త్వ మీమాంసా దృష్టి అయినా విషయాన్ని బట్టి అనుశీలన పద్ధతి మారడం సహజం. ఆవివిధ అనుశీలన పద్ధతులు ఏవ్యాసానికా వ్యాసాన్ని విడిగా పరిశీలిస్తే స్పష్టంగా తెలుస్తాయి. వ్యక్తిత్వంతో వివిధ కోణాల్ని పరిశీలిస్తే సమగ్ర వ్యక్తిత్వం స్ఫురిస్తుంది.

### సారస్వత వ్యాసములు

'రాయలనాటి రసికత', 'రాయల వైదుష్యము', అనేవ్యాసాలు ఆముక్తమాల్యద 'మనుచరిత్ర', 'పారిజాతాపహరణము', మొదలైన ప్రబంధాలాధారంగా ఆనాటి ప్రజల రసిక జీవనాన్ని నేటి ప్రజల సత్త్వహీనతను వివరించాయి.

'కావ్యములు అతిశయోక్తి ప్రధానమైనవి, అందలి వర్ణనలు వాస్తవ దూరమైనవి' అని ఆక్షేపించే వారికి సమాధానంగా:

"వ్రాసిన కవి సత్యమైయుండగా. అతడు జీవించి, సంచరించి, చూచి అనుభవించిన సంఘము కన్నుల యెదుట సత్యమై యుండగా అతడు వ్రాసిన కావ్యములలో మాత్రము అంతయును అసత్యమే యుండుట అసాధ్యము (పు. 1.) అన్నారు,"

ఈ వ్యాసాలు ఆనాటి జనుల జీవిత విధానాన్ని చిత్రీకరించాయి. కవుల వర్ణనల్లో దొర్లిన అతిశయోక్తులు ఈ విమర్శ వ్యాసాల్లో కూడా కని

పిస్తాయి. విమర్శకునితో మనకు ఆత్మీయ భావం ఉంటే వీటి పరమార్థం తెలుస్తుంది. ఈ వ్యాసాల్లో సాంఘిక విమర్శ (sociological criticism) ఉన్నట్లుగా అనిపించినా నిజానికి ఇవి అభిరుచి ప్రధానంగా చేసిన విమర్శలు.

స్వజాతి వారిలో ప్రబలిన అస్వాతంత్ర్యాన్ని నిరసిస్తూ, నేటి నాగరకులు అన్నింటా వ్యక్తంచేసే దాస్యాన్ని సున్నితంగాను, వ్యంగ్యంగాను చెప్పిన విమర్శ వ్యాసాలివి.

ఆకాలపు వారిలో 'రసికుల' సంఖ్య ఎక్కువని చెబుతూ రసిక శబ్ద నిర్వచనం ఇలా ఇచ్చారు.

"తన మనస్సున కానందమునిచ్చు భోగము లనుభవించుటలో కష్ట సుఖములుగాని, లాభ నష్టములుగాని, తుదకు ధర్మాధర్మములుగాని యెక్కువగా లెక్కపెటక పని చేయువాడు రసికుడు" (పు, 3)
''రసికతకు మూల ప్రకృతి సత్త్వము" అనిచెప్పి సత్త్వ హీనతయే నేటి సర్వానర్థాలకు మూలమని వివరించారు.

ప్రవృత్తి నివృత్తి భోగాలు రెండూ ఆనందాన్ని కలిగిసాయి. కానిఅనుసరించడానికి కావలసిన సత్త్వం ఉండాలని ఆయన భావం. ఆ నికులలో పెరిగిన అరసికతకు ముఖ్యకారణం ఉపేక్షాభావమని స్పష్టం చేశారు. దక్షత ఏవిధంగా సంపాదించ వచ్చునో విపులీకరించారు.

"దక్షత మనము చేతులార సంపాదింప వలసిన వస్తువుగాని, పుట్టుకచే వచ్చునదికాదు, ఒకరు బిచ్చమిచ్చునది కాదు. ఆకాశమునుండి రాలి పడునదియు గాదు. ఉపేక్షయొకటి త్రోసివేసిన దక్షత తనంత వచ్చును.'' (పు. 33)

శ్రీకృష్ణదేవరాయలలో ఉన్న స్వాతంత్ర్యకాంక్ష, ధర్మదాస్యత, యోగకాంక్ష నేటివారిలో మృగ్యాలని, పారతంత్ర్యపు పఱుపే మనకు అభిమాన పాత్రమైనదని సూటిగా చెప్పారు. ఇక్కడ విమర్శకులు గమనించవలసిన అంశం ఒకటుంది. రాళ్ళపల్లి ఉచితానుచితాలు తెలియని వ్యక్తికారు. ఈ వ్యాసాల్లో వర్ణించిన రాయలకాలపువారి సాంఘిక జీవనం చెప్పుదల్చు

కున్న విషయానికి ఎంతవరకు దోహదం చేసిందని మాత్రమే ఆలోచిస్తే విమ ర్శకుని దృష్టి బోధపడుతుంది. దినదిన ప్రవర్ధమాన మవుతున్న ఉపేక్షను, భావదాస్యాన్ని పారద్రోలి దక్షులుగా మారమని నాగరకులకు రాళ్ళపల్లి వ్యంగ్యంగా చెప్పారు ఈ వ్యాసాల్లో. వీటిని చారిత్రక పద్ధతి విమర్శతోగాని, సాంఘింక విమర్శతోగాని ముడిపెట్ట నవసరం లేదు.

'నాచనసోముని నవీన గుణములు' భావ, వస్తు, రచనా కళలను గూర్చి వివరించారు.

భావ, వస్తు, రచనా ప్రధానమైన రచనలు ఏసాహిత్యంలో నయినా పరిణామదశలో ఒదాని తరువాత ఒకటి క్రమంగా చోటు చేసుకుంటాయని సంస్కృత సాహిత్యాన్ని ఉదాహరణంగా చూపి, దాని ననుసరించి వికాసాన్ని పొందిన తెలుగు సాహిత్యంలోను అదే జరిగిందని అన్నారు

తిక్కన కవిత్వాన్ని భావకళకు, ఎఱ్ఱన కవిత్వాన్ని వస్తుకళకు, సోముని కవిత్వాన్ని రచనా కళకు ఉదాహరణలుగా చూపారు.

శర్మగారు అంతరంగవాది. భావ ప్రధానమైన కళలు ముఖ్యంగా కవిత్వం ఉత్తమమైనదని ఈ వ్యాసంలో స్పష్టం చేశారు.

నాచన సోమనాథుని కవిత్వాన్ని అనుశీలించడానికి భావము, వస్తువు రచన అనే ప్రమాణాల్ని తీసుకున్నారు. ఈ మూటికి రాళ్ళపల్లి ఇచ్చిన వివ రణను పరిశీలిస్తే—

> "చిత్రలేఖనము సంగీతము మొదలగు ఇతర కళలన్నిటి వలె కవిత్వ మునందును ప్రధానంగా నుండెడు తత్త్వములు రెండు భావము, వస్తువు (పు. 8)
>
> "......... భావము, వస్తువు అనురెండు తత్త్వములలో మనుష్యుడు వస్తువుల కంటె భావముల కెక్కువ లోపడి పరవశుడగు చున్నాడు. కారణమిద్ధి. భావములు ప్రాణిధర్మములు ......... కళల యందు గూడ వస్తు ప్రధానముల కంటె భావ ప్రధానమైన వానికే మానవ చిత్తవృత్తిపై బలమెక్కువ,' (పు. 51)

అని కవిత్వంలో భావ ప్రాధాన్యాన్ని చెప్పారు. వస్తుకళను గూర్చి ఇలా అన్నారు.

> "ఒక పూర్ణ వస్తువునకు సంబంధించిన యవాంతర విషయము లనేక ములేరి కూర్చుట వస్తుకళ" (పు.65)

రచనా కళను ఈవిధంగా వివరించారు.

> "భావ వస్తువులకు తోడుగా తక్కిన కళలవలె కవిత్వము నందును మూడవ తత్త్వమొకటి కలదు అదేదనగా రచన. అనగా ఆ భావ వస్తువులను వెలువఱచు పద్ధతి. ఇది ఆరెంటిని దెలుపు వాక్యములు, వాక్యములను గూర్చు పదములు, ఆపదములను లోగొన్న శైలి, ఛందస్సు మొదలగు వాని యందు గానవచ్చును." (పు 54)

భావ, వస్తు రచనా కళల తారతమ్యాన్ని ఉత్తమత్వాన్ని చెబుతూ కవిత్వంలో క్రమంగా ఇవన్నీ ప్రాధాన్యాన్ని సంతరించు కొన్నాయని చెప్పారు.

> "భావకళలో చదువరి తన్నే మరచిపోవును. భావ భారమును భావించు శక్తి లేనప్పుడు కవులు వస్తుప్రధానమైన కళకు దిగుదురు" (పు 56)

> "భావముతో నేమాత్రము సంబంధములేని వట్టిపదార్థముల కూర్పు ఎండిన వరుగు గంపకెత్తి నట్లుండును." (పు. 53)

> కవిత్వంలో ముఖ్యంగా గుర్తించ వలసినది భావకళ అని కిందివివరణ ద్వారా స్పష్టం చేశారు.

> రచన కవిత్వ కళకు బహిరంగమగు ప్రకృతి, భావస్తువు లంత రంగములు. కళావ్యక్తికి భావము జీవమని, వస్తువు బుద్ధియని రచన శరీరమనియు జెప్ప వచ్చును."

> ప్రధానమైన కళాంగము భావము. దానికి వస్తువును ఆ రెంటికిని రచనయు పరాధీనములుగా నుండవలయును. అదే యుత్తమ కళ. కాని తక్కిన రెంటికిని స్వతంత్రముగా, సూక్ష్మముగా నూడిన నంత

యానందము కలుగును. వస్తువెంత సహజముగా విరివిగా నుండిన నంత తృప్తి కలుగును, రచన యెంత యపురూపముగా కష్టముగా నుండిన నంత యాశ్చర్యము కలుగును'' (పు 54)

పై ప్రమాణాలతో నాచన సోముని కవిత్వాన్ని అనుశీలించి తమ అభిప్రాయాన్ని ఈ విధంగా వ్యక్తం చేశారు.

''నా యభిప్రాయమున నాచన సోమునిది భావముల ప్రాధాన్యము లేక వస్తువు, రచన దీనికి జేరిన కళ. ఆ కాలమున తెలుగు సాహిత్యమున కిది నవీనము. అవిదిత వేద్యాంతరమైన యానందము నిచ్చుశక్తి లేకున్నను తృప్తిని, ఆశ్చర్యమును గలిగించి మనల నుల్లాస పఱచు సామర్థ్యము దీనికి గలదు ......దీనికి లొంగని వాడు లేడు. కాని నిదానముగా యోజించినప్పుడు ఇంతకంటే మంచికళ కలదని తలపని వాడు లేడు'' (పు.72-73)

ఈ విషయంలో నడకుదుటి వీరరాజుగారి ఖండనకు సమాధానంగా ''ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథుని కీయదగిన స్థానము'' అనే వ్యాసంలో తమ స్వతంత్ర విమర్శనా దృక్పథాన్ని వ్యక్తీకరిస్తూ'' నా రుచికి పెద్దల వాక్యములు సరిపోవునాయని చూడ బ్రయత్నించు వాడనునేను'' (పు. 118) అనిచెప్పారు.

అనుభవానికి తగిన వ్యక్తీకరణ ఉండటం విమర్శకుని కుండవలసిన ముఖ్యలక్షణం. పడికట్టు పదాలతో కవిత్వ వివేచన చేయలేని రసిక జీవి రాళ్ళపల్లి. అనుభవ వివేచనకు తగిన సాధన సామగ్రి ఆయనకు అసంకల్పితంగా అబ్బింది. విమర్శకు నూతన ప్రమాణాలను పరిచయం చేస్తూ తమ స్వతంత్ర దృక్పథాన్ని వ్యక్తం చేశారు రాళ్ళపల్లి.

ఎఱ్ఱన హరివంశాన్ని చూసిన తరవాతే సోమన హరివంశాన్ని రాశాడని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. నాచన సోమన ఎఱ్ఱన కన్నా ప్రాచీనుడనే వాదంలో వీరికి నమ్మకం లేదు. సోముని కవిత్వాను శీలనకు తానను సరించిన ప్రమాణాన్ని ఈ విధంగా వివరించారు.

"కావ్యమునకు జీవనము. రసము ఇప్పటి పండితుల కనేకులకు చమత్కారమునకు, రసమునకును భేదములేదు.........రసమనగా మనలాక్షణికులు నియమించినట్లు శృంగారము మొదలగు తొమ్మిది భేదములే కలిగి 'యలౌకిక చర్వణా విషయమగు నొక వివరి పరాని పదార్థమని నాయుద్దేశముగాదు. తర్కశాస్త్ర పరాధీనులగు మనలాక్షణికులు వాదవివాదములనుబెంచి యెవరో వ్రాసిన రసలక్షణమలనే స్థాపింప బూని, రస శబ్దమునకు మార్గమును సంకోచపరిచిరని నాయభిప్రాయము

......... ఏభావములైనను వాని తీక్షదశలోనవిదిత వేద్యాంతరముగా ననుభవింప గల్గుదు మేని, యానంద స్వరూపములై రసశబ్ద వాచ్యములగును. అనగాశిల్ప మందన్నమాట. జుగుప్సా, భక్తి, వాత్సల్యాదులుగూడ రసములే యని వాదించు వారు మనలో లేకపోలేదు. కవిభావనా బలముచే తనకు గలుగు వివిధము లగు శోకము, మోహము, అసూయా, ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావము లనబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి విగ్రహములను (ఏ విగ్రహమైననుసరే) సరసమగు భాషతో దీర్చి యెదురనిలిపినపుడు రసానుభవ సంస్కారముగల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి అవి యెట్టివైనను, శిల్పమందుగల యొకానొక యనిర్వచనీయ మహిమచే ఆనందముగా బరిణమించును. ఈయర్థమందే ప్రకృతము రసపదమును నేనుపయోగించెదను. అది యిన్నే విధములని పలకపై సుద్దతో వ్రాసిచూప సాధ్యముగాదు. కవిత్వ సామాన్యమునకది ప్రాణము. కవిదానిని దీర్చినట్లెల్ల నందుకు దగిన మర్యాద బొందును. తక్కిన గుణములు, అలంకారములు, రీతులు పాకములు, మొదలగు నర్థ, శబ్ద ధర్మములన్నియు నాభావ ధర్మమునకుపస్కారకములుగాగలవు. కాని దాని తరువాతవి." (పు. 116-118)

'రసము'ను గూర్చి రాళ్ళపల్లి వెలిబుచ్చిన అభిప్రాయం ఆయన పరిశీలన నైపుణ్యానికి, సునిశితత్వానికి అద్దం పడుతోంది. ప్రాచ్యులు చెప్పినట్లుగా రససంఖ్య నియతమైనదన్న ఆయన అంగీకరించటంలేదు. కవిత్వంలో ఉండవలసిన లక్షణం ఏవిషయాన్ని చెప్పినా రసముప్పతిల్ల

జేయటం. ఇది సహృదయుని అనుభవంలోకి రావాలి. కవికి ఏభావాన్న యినా సరళమైన భాషతో, శిల్పం చెడకుండా రూపొందించ గలిగే నేర్పు ఉండాలని ఆయన అభిప్రాయం రసం ఎక్కడో ఉంటుంది, అదేదో వివ రింపరానిదని, అలౌకికమని ఆయన ఒప్పుకోరు. రసానుభవ సంస్కారం కల సహృదయుడు కవి వర్ణించే భావంతో తాదాత్మ్యాన్ని చెందినప్పుడు కలిగే ఆనందమే రసమని రాళ్ళపల్లి నిర్వచనం.

'కవిత' అనే వ్యాసంలో కవిత్వానికుండ వలసిన నాల్గులక్షణాలను వివరించారు 1. చక్కనిసాహితి. 2 ఛందశ్శాస్త్రమున జ్ఞానము 3. ఔచి త్యము 4. సారళ్యము. ఈనాల్గింటిని ఈవిధంగా వివరించారు.

> "సాహితి యనగా నేభాషలో గవిత జెప్పబూనునో యాభాష యందు నిర్దుష్టమగు జ్ఞానము. ఏపదమునకే యర్థమున శక్తిగలదో యేమాట నెట్టిచోటు నుపయోగించిన నేయర్థము మారునో చక్కగ నెఱిగిన గాని కవిత్వము జెప్పబూనరాదు. ...... తాను వర్ణించిన కాలము నకును, జాతము లకును అవిరోధముగ వర్ణించి చెప్పుటయే ఔచిత్య మనబడును ......సారళ్యమనగా నన్వయ కాఠిన్యము లేకుండుట ...... ముఖ్యముగ అర్థగాంభీర్యమునకు తోడు శబ్ద సారళ్యము గూర్ప నభిలషింప వలయునేకాని, పదములో గాంభీర్యము నపేక్షిం చుట కవితాలతకు మూలచ్ఛేదన మొనరింప జూచుటయే."[3]

కవికి ప్రతిభ, వ్యుత్పత్తి రెండూ అవసరమే. కాని వ్యుత్పత్తి దేశ కాలావధులను దాటకుండా ఔచిత్యవంతంగా కవితను తీర్చిదిద్ద గలగాలి. అర్థగాంభీర్యం ఎంత అవసరమో శబ్దసారళ్యం అంతకన్నా ముఖ్యమని రాళ్ళపల్లి ఉద్దేశం.

రసాన్ని, ఇతర కవితా లక్షణాలను రాళ్ళపల్లి నిర్వచించిన విధానంలో ప్రాచ్య, ప్రాశ్చాత్యలాక్షణిక సంప్రదాయాల సమన్వయం కన్పిస్తుంది. 'రస' శబ్ద నిర్వచనం వెనుక సౌదర్య తత్త్వ దృక్పథం ఉంది. ఏ భావమైనా రమ్యంగా తీర్చిదిద్దినపుడు ఆనందంగా పరిణమిస్తుంది, అనే భావనకు మూలం పాశ్చాత్య సౌందర్య మీమాంసే,

'భావములు రసమును పుట్టించునవి. వానిని కవి తీర్చిదిద్దినట్లుగా, కావ్యమునకు ఆస్వాద నీయత పెరుగును' అని చెప్పడం ద్వారా ఆనంద వర్ధనాచార్యుని, రసధ్వనిని, క్షేమేంద్రుని ఔచిత్య సంప్రదాయాన్ని శర్మగారు సమానంగా ఆదరించినట్టు స్పష్టమవుతుంది. వీరు చేసిన రస స్వరూప సమీక్ష —

రసేనైవ సర్వం జీవితి కావ్యం: నహి రస శూన్యం
కావ్యం కించిదస్తి రస ఏవవస్తుతః ఆత్మాః
వస్త్వలంకార ధ్వనీతు సర్వధారసం ప్రతి పర్య
వస్యేతే[4] — అనే అభినవగుప్తుని నిర్వచనానికి దగ్గరగా ఉంది.

'నిగమ శర్మ అక్క,' 'తిక్కన తీర్చిన సీతమ్మ' అనే వ్యాసాలు పాత్ర పోషణ విధానాన్ని అనుశీలించిన వ్యాసాలు.

తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యము మూడవ ఆశ్వాసం లో 'నిగమశర్మ అక్క' పాత్రచిత్రీకరణ విధానాన్ని, అతని కవిత్వానికి గల ప్రాణశక్తిని వివరించారు. రామలింగని కవిత్వంలో —

"అంగ సృష్టి అంగిసృష్టికన్న ఎక్కువ. కానియాయంగములే ప్రాతః కాలమున ప్రాకారముమీద నిక్కిచూచులే దీగల కొనలవలె ప్రాణ శక్తితో తకతకలాడు చుండును. సంపూర్ణ వస్తు నిర్మాణము నకు అతని యందు లేనిది నేర్పుగాదు ఓర్పు." (పు. 74)

కవి కథను బట్టి కొన్ని పాత్రలను ఉదాత్తంగా చిత్రీకరిస్తాడు. అది కవికి గల స్వేచ్ఛ. నిగమశర్మ జూదరి, వ్యభిచారి, ఇంటిపరువు మంట గలిపాడు. అటువంటి వాడిని మంచి మార్గంలో పెట్టటానికి ఓర్పు, నేర్పుకల అక్కగారే తగింది. కవిత తన లేఖినిని అమృతంలో అద్ది దిద్ది తీర్చిన పుత్తడి బొమ్మ, ఈ పేరులేని పేరంటాలు, రామకృష్ణుని తెలివిని, చురుకుదనాన్ని రంగరించుకున్న అపూర్వామృత మూర్తి ఈ పాత్ర.

తమ్ముని వలన కుటుంబానికి వచ్చిన దురవస్థను పారద్రోలాలని స్థిర సంకల్పంతో వచ్చింది. క్షణంలో పరిస్థితులను ఆకళింపుచేసుకుని, తమ్మునికి

చెప్పవలసిన రీతిగా బుద్ధులు చెప్పింది. కాని ఫలితం దక్కలేదు. తమ్ముడు ఇంట్లో సొమ్ములు దొంగిలించాడు. వాటిలో అక్కగారు ఎంతో మోజుపడి క్రొత్తగా చేయించుకున్న 'ముక్కర' కూడా ఉంది. ఇక్కడే రామకృష్ణుడు తానెంతో నేర్పుతో తీర్చిదిద్దిన స్త్రీమూర్తికి ఒక దిష్టి చుక్కను పెట్టాడు. 'ముక్కర' పోయిందని అక్కగారు ఏడ్చిందని ప్రత్యేకంగా చెప్పడం రామకృష్ణకవి పరిహాస దృష్టి ప్రదర్శిస్తుందని చెప్పారు. కొసమెరుపువంటి ఈ ముగింపు 'నిగమశర్మ అక్క'ను సజీవపాత్రనుచేసింది. సమర్థుడైన కవి ఓర్పు కోల్పోయినా నేర్పుతో సహృదయులకు రససాక్షాత్కారాన్ని కలిగించగలడని రాళ్ళపల్లి భావం.

'తిక్కన తీర్చిన సీతమ్మ'— నిర్వచనోత్తర రామాయణంలో తిక్కన్న చేసిన ఔచిత్యవంతమైన మార్పులు చేర్పులు వివరించే వ్యాసం.

అనువాదాలలో పాత్ర పోషణ విధానాన్ని పరిశీలించడం న్యాయం కాదని వీరి అభిప్రాయం. రామాయణం, భారతాదుల్లో స్వతంత్రించి పాత్ర పోషణ చేయడం కష్టం. ముఖ్య విషయాలు మార్చే అధికారం అనువాదకునికి ఉండదు. అయితే అనుభవానికి తగినట్లు తనకు తోచిన చిన్న చిన్న మెరుగులు పెట్టుకుని పాత్రలను చిత్రీకరించడం జరుగుతుంది. నిర్వచనోత్తర రామాయణంలో తిక్కన అక్కడక్కడ ఇటువంటి మార్పులే చేశారు. ఆ మార్పు, చేర్పుల ఔచిత్యాన్ని వాటివల్ల సీతమ్మ పాత్రకు లభించిన సమగ్ర వ్యక్తిత్వాన్ని ఈ వ్యాసంలో వ్యక్తం చేశారు.

సీతాపరిత్యాగ ఘట్టంలో తిక్కన్నగారి కల్పనలు, వివిధ పాత్రల ప్రవర్తన ద్వారా సీతమ్మ వ్యక్తిత్వాన్ని స్పష్టం చేసిన తీరు వివరణలతో తులనాత్మకంగా పరిశీలించారు.

సీతాదేవి అడవులకు ప్రయాణమయ్యే సమయంలో వాల్మీకి రాముడు రంగ ప్రవేశం చేయలేదు. కాని తిక్కన రాముని ప్రవేశపెట్టాడు. లక్ష్మణుడు నిజం చెప్పకుండా దాటవేస్తూ అయినా సీతమ్మకు వ్యక్తిత్వం కల్పించాడు.

మిగిలిన రామాయణ కర్తలెవరు వేయించని ప్రశ్న తిక్కన రామాయణంలో సీతాదేవి చేత వేయిస్తారు. రాముడెంతటి ధర్మబద్ధుడో, సీతకూడ అంతటి ధర్మ బద్ధురాలే. భర్త స్వయంగా వచ్చి ఈ విషయం చెప్పడానికి నేను తగనా అని లక్ష్మణుని ప్రశ్నిస్తుంది. ఈ సన్నివేశం ద్వారా సీతమ్మ స్వాభిమాన గౌరవాలు ఉన్నతంగా కన్పించాయని రాళ్ళపల్లి వారి తీర్పు.

తిక్కన రామాయణంలో వాల్మీకికి ధర్మపరాధీనతఉంది. దానితో పాటు సీతకు జరిగిన అన్యాయం రాముని చరిత్రకు మచ్చవంటిదని అంగీకరించడానికి తగిన సహృదయత ఉంది. కాని వాల్మీకి రామాయణంలోని వాల్మీకి పాత్రలో ధర్మపరాధీనతే అధికంగా కన్పిస్తుంది. తిక్కనగారి వాల్మీకి రెండు ధర్మ కోణాల నర్థం చేసికున్న తపస్వి అని రాళ్ళపల్లి వివరించారు. అదే విధంగా సీతమ్మ పాత్రను అర్థం చేసుకుని, ఏ కాలంలో చదివినా వన్నె తరగని చిత్రీకరణ తిక్కన చేశాడని అన్నారు. దీనికి తిక్కనకున్న లోక జ్ఞానం తోడ్పడిందని ఆయన భావం.

'త్యాగయ్యగారి నాదసుధారసం' అనే వ్యాసంలో త్యాగయ్యను 'భక్తి కవిత, గానము'ల త్రివేణీ సంగమంగా కీర్తించారు.

త్యాగయ్య కవిత యేర్పులూ, తీర్పులూ లేక అశువుగా సాగింది లోక శాస్త్ర కావ్యాదుల వలన కలిగే జ్ఞానం ఆయన కవితలో కన్పించదు. అందువల్లే ఎన్నో కీర్తనలలో భావం అస్పష్టంగా అన్పిస్తుందని కారణం చెప్పారు.

ఇంక త్యాగయ్య నాదమాధుర్యాన్ని ఇలా విశదీకరించారు.

> "త్యాగయ్యగారు ఆజీవమానం అఖడంగా అంతరంగంలో సాధించింది రామభక్తియోగం, బహిరంగంలో అట్లే సాధించింది నాదయోగం. కవిత్వం ఈ రెంటికీ పొత్తుకలిపే కొండివంటిది. అది యీరెండు మహాద్రవ్యాల ఒత్తిడిలో సన్నగిల్లి మసక మసకయి పోయింది.'"
>
> (పు. 134)

'త్యాగయ్యగారి నాద సుధారం' తిక్కన తీర్చిన సీతమ్మ, నిగమశర్మ అక్క మొదలైన వ్యాసాల్లో రాళ్ళపల్లి సృజనాత్మకత వ్యక్తమవుతోంది.

విమర్శలో సృజనాత్మక లక్షణం అభిరుచి విమర్శకు మొదటి మెట్టు. అభిరుచి విమర్శకునికి కవిత చదివినప్పుడు తానుపొందిన ప్రతిచిన్న అనుభవమూ, ఆనందమూ విలువైనవే. ఇంకా వివరింగా తెలుసుకోవాలంటే —

> "Typically, the impressionistic critic gives his account of a poem by singling out the most vivid of the sensations and attitudes it evokes in him and exploring them as he pleases, some times with in the frame work of the poet's other writings, but more often with in a free range of his own literayr personal experience." [5]

"రంగనాథ రామాయణము" అనే వ్యాసంలో రంగనాథ రామాయణ కర్తృత్వ విషయం ప్రధానంగా చర్చించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు రంగనాథరామాయణ పరిష్కరణ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే చేయించారు. వారికి శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారు సహాయం చేశారు. పీఠికలలో వేటూరి వారిపేరు నామమాత్రంగా ఉండటం, రంగనాథ రామాయణ కర్త బుద్ధభూవిభుడనటం, గ్రంథంలో జేర్చిన సులోచన వృత్తాంతం మొదలైన అంశాలపై విమర్శజరిగింది.

ఇది కట్టమంచికి రాళ్ళపల్లికి మధ్యనడచిన వివాద వ్యాసం. పీఠికలో కట్టమంచి వెలిబుచ్చిన అభిప్రాయాలు రాళ్ళపల్లికి సరిపడలేదు. రంగనాథ రామాయణము రంగనాథుని కర్తృకమని, తిక్కనకంటె ముందు ఈ రామాయణ రచన జరుగలేదని తమ అభియాన్ని స్పష్టం చేశారు.

శర్మగారి 'సారస్వత వ్యాసాలన్ని' వీరి అనుశీలన వైశిష్ట్యానికి నిదర్శనాలు. విషయ సమగ్రత, స్పష్టత వీటిలో మనకనిపించే విశేషాలు. సృజనాత్మకత వీటికి వన్నె తెచ్చింది. అభిరుచిని వెల్లడించింది. చెప్పే విషయానికిగల పూర్వాపరాలు వివరించడం, దానికి సంబంధించిన వివిధ విషయాలను చర్చించి తమ అభిప్రాయాన్ని స్పష్టం చేయడం వివాద వ్యాసాల్లో కనిపిస్తుంది. ఇవివారి సృజనాత్మక రచనకు, పాండిత్యానికి, సరసమైన అభివ్యక్తికి అద్దం పట్టాయి.

## నాటకోపన్యాసములు

వీటిలో ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాస రావుల నాటక సాహిత్యాన్ని తులనాత్మక పద్ధతిలో అనుశీలించారు. ఇవి రెండు ఉపన్యాసాలు. మొదటిది లలితకళలు — వానిలో అభినయ కళా ప్రాధాన్యం, స్వభావవాదుల సిద్ధాంత ఖండన స్వసిద్ధాంత నిరూపణంగా సాగిన లక్షణచర్చ.

రెండవది ధర్మవరం వారు, కోలాచలం వారు అనుసరించిన నాటక రచనా విధానము, పాశ్చాత్యభావ ఖండన, సమర్థనలు, వీరిరువురి రచనలోని తారతమ్యాలు, గుణ దోషాలు, ఔచిత్యానౌచిత్యాల వివరణ రూపంగా ఉన్న ఉపన్యాసం.

తాము అనుశీలించే ప్రక్రియకు సంబంధించిన సరళ పరిచయం, అనుసరించిన సిద్ధాంతాలు, లక్షణాలు మొదలైన వానిని పఠితలకు పరిచయం చేసి అనుశీలించడం పందొమ్మిదో శతాబ్దపు పాశ్చాత్య సాహిత్య విమర్శకులలో సాధారణంగా కన్పిస్తుంది. ఈ ప్రభావప్రేరణో లేదా సంస్కార జనితమో కాని రాళ్ళపల్లి విమర్శలలో కూడ ఈ లక్షణం కన్పిస్తుంది. నాటకోపన్యాపసాలు దీనికి ఉదాహరణంగా చెప్పవచ్చు.

మొట్టమొదట "కావ్యేషు నాటకం రమ్యమ్" అని పెద్దలు చెప్పిన వాక్యసామంజస్యాన్ని లలితకళల సమగ్ర పరిశీలనతో స్పష్టం చేశారు.

''చిత్రలేఖనము, శిల్పకళలలో చలనరూపమును చిత్రీకరించలేము, కవిత్వమున సంకేతరూపమైన భాషచేత అంతరంగ బహిరంగ చిత్రణ చేయవచ్చు. ఈభాష ద్వారాకూడ వ్యక్తీకరింపలేని సూక్ష్మ, సూక్ష్మతర భేదములను సంగీతము ద్వారా వ్యక్తీకరింప వచ్చును. అభినయమున హావభావ ప్రదర్శన రమ్యముగా చేయవచ్చును. కాని అచేతన ప్రపంచమును చూపుట అసాధ్యము''అని లలిత కళలను గూర్చి వివరంగా చెప్పి, ఆపిమ్మట కళా సామాన్యధర్మాన్ని వివరించారు.

"భిన్నపదార్థముల నొకచోట జేర్చి చేయుకూర్పు కళ" (పు.4) నాటకమును ప్రాచీనులు ఇట్టికళగా తీర్చి దిద్దారు. కళకు అనుకరణం ప్రధానం. ఇతర కళల సహాయంతో ఇటువంటి అనుకరణకు సమగ్రత నివ్వడం నాటకకర్త ఉద్దేశం కావాలి. దానిలో అనౌచిత్యాలకు, అస్పష్టతకు తావుండరాదు.

నాటకాల్లో నృత్యం, సంగీతం, అభినయం సమపాళ్ళలో ఉంటే రసికులైనవారు ఆనందించవచ్చు. అయితే నాటకంలో నృత్యాన్నిచూచి సంతోషించడం అనుభవ రసికులకు మాత్రమే సాధ్యమని విమర్శకులకు కాదని చెబుతూ —"మొదటిది హృదయమును నమ్మినది రెండవది. మెదడు నాశ్రయించినది" (పు. 6) అనిచెప్పారు. ఆనందిచడంతోపాటు, ఔచిత్యానౌచిత్యాలను గుర్తించడం విమర్శకుని కర్తవ్యం కనుక పైఅభిప్రాయం సమర్థనీయమే. ఆధునికులలో అధికమవుతున్న కళాస్వాతంత్ర్య వాదాన్ని రాళ్ళపల్లి అంగీకరించలేదు. "పరస్పర సహాయమే సృష్టిలోని మూల తత్త్వము. కూర్పుకళా ధర్మము" (పు. 8) అని స్పష్టం చేశారు.

వాస్తవానుకరణం కళకు ముఖ్యం కనుక పద్యాలు, గేయాలు అనవసరం అనేదానికి సమాధానంగా నాటకంలో పద్యాలు, సంగీతం ఉండవచ్చు. ఉంటే ఔచిత్యమే అనిచెప్పారు. ఔచిత్యాన్ని ఏవిధంగా సాధించవచ్చో కూడ తెలిపారు.

అనుకరణలో పాటించవలసినదిలయ దీనిని 'సామ్యము'అనే అర్థంలో గ్రహించారు. ఇదేకళలో సౌందర్యానికి కారణం అన్నారు.

"ఉండునది, ఉండవచ్చునట్టిది, ఉండవలయు నట్టిదియునగు వస్తువును
ప్రదర్శించుటతోడనే కళలన్నియు మొదలు పెట్టును" (పు. 10)

ఈ ప్రదర్శనలో 'లయ' ఉండాలి. అప్పుడే చక్కదనం.

కళాప్రయోజనాన్ని, ఆనంద స్వరూపాన్ని వివరిస్తూ "కళకు అనుకరణము సాధనము, సాధ్యము చిత్తైకాగ్రత. దాని ఫలము శాంతి......ఈ శాంతిని సాధించు వస్తువులయము. శాంతియనగా సోమరితనము కాదు; ఏకాగ్రత. అవిదిత వేద్యాంతరముగా ఏదేని యొక వస్తువునందు చిత్తము నిల్ప గలుగుట, బహు భేదములచే భిన్నమగు ఈ ప్రపంచమునందు అభేదానుభవ

మును సంపాదించుట. ఇట్టి అవస్థ ఆనందమయము. ఆనందమనగా సుఖము కాదు. సుఖము ఇంద్రియములకు సంబంధించినది. ఆనందము ఆధ్యాత్మికము. అనగా ఆత్మకెక్కువ సంబంధించినది. సుఖము ఆనందము యొక్క మిత స్వరూపము మఱియు చంచలము. సుఖమే దుఃఖమునూ అగును. ఇంకనూ మించిపోయిన విషయమగును. ఆనంద మట్టిది కాదు. సంపాదించు కొలది ఆళ్లూరును. అమేయమగును." (పు. 13–14)

ఈ 'లయ'ను సాధించటం వల్లనే ఔచిత్యం కలుగుతుంది.

"సౌందర్యము, సౌమనస్యము, అనురూప్యము, అభిమానము, స్నేహము — అనుభావములకెల్ల ఇదే ఆధారము'' (పు. 16).

అని చెప్పి 'లయ'ను కళాసౌందర్యకారణంగా రాళ్ళపల్లి నిరూపించారు.

కట్టమంచి రామలింగారెడ్డిగారు "కళయందు రెండుగుణములు చూపించవచ్చును. సుఖము చమత్కారము శిల్పము యొక్క అభిమతము సుఖము గాని, చమత్కారము గాదు"[6] అన్నారు. రాళ్ళపల్లి దీనికన్న మరింత ముందుకు వెళ్ళి సుఖముయొక్క మితస్వరూపాన్ని, ఆనందము యొక్క అమేయత్వాన్ని స్పష్టం చేశారు.

నాటకములో పద్య, గేయాల ఆవశ్యకతను గూర్చి చరిస్తూ "తీవ్రవములైన ప్రాణి భావ భేదములను గానము చూపగలిగినట్లు ఏ యితర కళయు చూపలేదు." (పు. 17) అని సంగీతము అంతరంగాన్ని ప్రదర్శిస్తుందని చెప్పారు

సాంఘిక నాటకాలలో (comedies) పద్యాలు, గేయాలు ఉండవచ్చునని గంభీరము (tragedies)లలో ఉండరాదని చెప్పేవారికి సమాధానం ఈ విధంగా ఇచ్చారు.

"అంతరంగము కళా వస్తువు జీవనము అది యొక్కటి సృష్టిలో నుండు వఱకును, ఏ కళగాని స్వతంత్రముగా, సంపూర్ణముగా దానిని అనుకరింప జాలదనుట సత్యములలో సత్యము" (పు. 25)

గంభీరాలైన సాంఘిక రూపకాలు ఈ సత్యానికి దూరం కావని స్పష్టం చేసారు.

రెండవది— 'స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలి' అనే స్వభావ వాదులకు సమాధానమిస్తూ రెండు కోణాలనుంచి విషయాన్ని పరిశీలించి తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. కళకు సంబంధించిన అంశం ఒకటి. నీతికి సంబంధించిన అంశం మరొకటి.

"కళ వ్యక్తికి జేరినదిగాని జాతికి జేరినదిగాదు" అని స్త్రీలైనా, పురుషులైనా, కళారాధనలో ఒకటే అనే సత్యాన్ని స్పష్ట పరచారు.

విశిష్ట వ్యక్తుల మాటను వదలి చూచినప్పుడు రంగస్థలం మీద స్త్రీ, పురుషుల స్వచ్ఛంద ప్రవర్తన వల్ల నీతికి భంగం కలిగే అవకాశముందని స్పష్టం చేశారు.

రెండో ఉపన్యాసం ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు గారి నాటకాలను గూర్చి చర్చించినది.

మొదట వీరిరువురిలో సమానంగా ఉన్న విషయాలను వివరించారు. తెలుగులో స్వతంత్ర నాటకాలు రాయడం వీరితోనే ఆరంభమైంది. నాటకాలకు ప్రసిద్ధి కూడ వచ్చింది.

నాటకకర్తలిరువురికి సంస్కృతాంధ్రాంగ్ల భాషలతో పరిచయం ఉండ ఆయా సాహిత్యాలలో తమకు నచ్చిన అంశాలను ఇద్దరూ స్వీకరించారు కొన్ని మార్పులు, చేర్పులు చేసి ఆంగ్ల సంప్రదాయాన్ని కూడా స్వేచ్ఛగా అనుసరించారు.

వీరిద్దరు నాటకాలను పద్య గద్య మిశ్రితంగానే రాశారు. అయితే పద్యాలు రాయటానికి సమయం, సందర్భం కావాలని, భావములకు తీవ్రత లేనిచోట పద్యాలు అవసరం లేదని రాళ్ళపల్లి స్పష్టం చేశారు, భావ తీవ్రత, గంభీర సన్నివేశాల్లో శబ్దార్థ రచనలతో నున్న సంభాషణలు అనౌచిత్యానికి దారి తీశాయని ఒకటి రెండు ఉదాహరణలిచ్చారు. నాటకము అంతా రాసిన పిమ్మట నటించే వారి అనుకూల్యం కోసం రాసిన పద్యాలు, సంభాషణలు కొన్నిసార్లు అనౌచిత్యాలుగా మారాయని చెప్పారు.

"ధర్మవరము వారు, కోలాచలము వారు పాశ్చాత్య సారస్వత పరిచయము మూలమున తమ మాతృభాషను తన్మూలమున దేశీయులకు వృద్ధికి, దేవలయునని యుద్రేకముతో ప్రవర్తించినారు. కానీ వీరేశలింగము పంతులు మొదలగు కొందఱి వలె అన్ని త్రోవలలోను నడువబోయి అవకతవక పని చేయలేదు'* (పు. 40) అని ధర్మవరం, కోలాచలం వారిరువురు పాశ్చాత్య ప్రభావం వల్ల తెలుగు నాటకరంగానికి చేకూర్చిన వన్నెను తెలియజేశారు.

"అంశములను రంగములుగా విభజించుట, నాందీ ప్రస్తావనలు వదులుట, మరణము మొదలగు వానిని ప్రత్యక్షముగా చూపుట — ఇత్యాదులలో పాశ్చాత్య పద్ధతి ననుసరించి మన కవులు నాటక రచనకు చాల. మేలిమి తెచ్చిరనుటలో సందేహము లేదు'' (పు. 51) అని పాశ్చాత్య సంప్రదాయాలను పాటించి ఔచిత్యాన్ని కలిగించారని అంగీకరించారు.

"నాంది"ని నాటకకర్తలు కాని, నటులు కాని మెప్పించలేకున్నారని, రసభంగం కాని రీతిలో దానిని వదలివేసి రాసిన, ఇరువురు నాటకకర్తలను శ్లాఘించారు. 'ప్రస్తావన' ప్రేక్షకులను నాటకోన్ముఖులుగా చేస్తుందని భావించారు. ఈ నాటకకర్త లిద్దరు ప్రస్తావనను వదలివేసినా ఈ ప్రయోజనాన్ని నెరవేర్చే మరో ప్రక్రియను చేపట్టలేదని చెప్పారు,

రంగస్థలమున చూపరానివని ప్రాచీనులు విధించిన వానిలో అన్నిటిని శర్మగారు సమర్థించారు. ధర్మవరం వారి నాటకాలలో శృంగార చేష్టలను రంగస్థలంపై ప్రదర్శించడం అనౌచిత్యమని వీరి తీర్పు.

నాటకాల్లో విష్కంభ, ప్రవేశకములు నిర్వర్తించే ప్రయోజనాన్ని చెప్పి ఈ కవులిరువురు వీటిని గమనించలేదని చెప్పారు,

ఆంగ్ల సాహిత్య పరిచయంతో ఈ కవులు చేసిన మరో ప్రయోగం విషాదాంత నాటకాలను రచించటమని చెప్పి — కృష్ణమాచార్యుల సారంగ

ధర నాటకమొక్కటే ఆద్యంతం విశాదాంతమని చెప్పారు. ఇది కేవలం పాశ్చాత్య కవులలో ఉన్న మితిమీరిన ధోరణిని అనుకరించటం వల్ల రస భంగానికి కారణమైందని రాళ్ళపల్లి అభిప్రాయం. శోకాంత నాటకాలు ఉండ కూడదని రాళ్ళపల్లి అభిమతం కాదు. ప్రతిరసము హద్దుమీరిన తరువాత అసహ్యంగా పరిణమిస్తుందని వీరి ఉద్దేశం. 'సారంగధర' నాటకంలోని విషా దాన్ని; అందువల్ల నాటకంలో తగ్గిన వన్నెను సుదీర్ఘంగా చర్చించి ఉదాహ రణలతో చూపారు. —

> "పదిశోకాంత నాటకములు చేసినంతపని తెలుగు వారికిది యొకటే చేసినది. చేయుచున్నది. దీనికి దగినట్లు కార్చుటకు గావలసినన్ని కన్నీళ్లు తెలుగువారి కున్నవాయని సందేహపడవలసి యున్నది" (పు. 58) అని అన్నారు.

సారంగధర నాటకంలోని శోకం హద్దుమీరినట్టిదని చెబుతూ:

> "రసమేది యైననుమనము సహజముగా నేర్పరచుకొన్న నీతి, ధర్మము, ఆనురూప్యము, సౌమనస్యము, మొదలగు హద్దులను మీఱిపోయినచో దానిఫలమగు ఆనందమును మన మనుభవింప జాలము" (పు.61)

అని ఔచిత్యాన్ని మీరినదేదయినా ఆస్వాదయోగ్యం కాదని భావించారు.

"నీతిబోధ విషాదాంత నాటకములందువలె మంగళాంత నాటకము లందు గలుగజాలదని నాతప్పని యభిప్రాయము" (పు. 60) అనే ధర్మవరం వారి అభిప్రాయాన్ని రాళ్ళపల్లి అంగీకరించలేదు.

> "విషాదము నెక్కువగా నాటకములందనుభవించుటచే జనులు నీతి మంతులగుదురనుట నాసిద్ధాంతమునకుగాని, యనుభవమునకుగాని యింకను రానిమతము." (పు. 60) అని, అలాభావించడం పాశ్చాత్యుల ట్రాజిడీల అనుకరణ ఫలితమేనని స్పష్టం చేశారు.

నాటకం ద్వారా నీతిని బోధించాలి అన్న స్పృహ ధర్మవరం వారి కంటె కోలాచలం వారిలోనే ఎక్కువని చెబుతూ ఇలా అన్నారు.

"కళాసంసారమున నీతి తెరమఱుగు భార్యగా నుండి పనిచేయ వల యునేకాని ముందు పడి మొగము జూపి త్రోసికొని రారాదు. అట్లయినచో క్షేత్రభాగ్యసు చెడును" (పు. 77)

అయితే వీరిరువురు 'నీతిపేర రసమును గాని, రసమనుపేర నీతిని గాని ప్రాయశః బెరచిన వారు గారని' అన్నారు.

మిశ్రపాత్రలు లోకసహజమని, నాటకాలలో మిశ్రపాత్రలుండుట వలన ఔచిత్యం కలుగుతుందనే స్వభావ వాదులతో రాళ్ళపల్లి ఏకీభవించలేదు.

"పాత్రములతో మనకు తన్మయత్వము కలుగుట, వాని స్వరూపము మన హృదయ ము లందచ్చుపడుట, కవియు, నటుడును వానికిచ్చిన తీర్పును బట్టి, వర్చస్సును బట్టి యుండునేకాని అది మిశ్రములుగా నున్నంత మాత్ర మున గలుగదు'' (పు. 67) అని చెప్పారు. ఇంకా మిశ్రములగు దుర్బల వ్యక్తులెట్లో అట్లే నమ్మిన నమ్మికకు, దగినట్లు పట్టిన పట్టువదలని ప్రబల వ్యక్తులును ప్రకృతియందు సహజములు' అని మిశ్ర పాత్రలు కాని, ప్రబల వ్యక్తులుకాని కవి భావనను బట్టి రూపుదిద్దుకుంటాయని చెప్పారు.

నాటకోపన్యాసాలు ప్రాచ్య, పాశ్చాత్య నాటక పద్ధతుల భేద సాదృశ్యాలను సందర్భానికి తగినంతవరకు చర్చించారు. శర్మగారిలో సహృదయుని, కవిని అర్థం చేసికొని సమన్వయించగల నేర్పుఉంది. సంయమనంతో సాగే అనుశీలన, సహేతుకంగా జరిగే పరిశీలన వీరి విమర్శకు పెట్టని అలంకారాలు. ప్రక్రియ యేదైనా చెప్పే విషయమేదైనా ఔచిత్యమే ముఖ్యమని చెప్పడం చేత సహృదయాకర్షకాలుగా వెలుగొందాయి ఈవిమర్శలు

## రాళ్ళపల్లి పీఠికలు

పీఠికారచన తెలుగు సాహిత్యంలో ప్రౌఢుదౌర కాలంనుంచి వ్యాప్తిలోకి వచ్చిన సాహిత్య ప్రక్రియ. పీఠికలో కవి పరిచయం, గ్రంథస్థ విషయ పరిచయం ఉంటాయి. నాటకానికి 'నాంది' ఎటువంటిదో కావ్యానికి పీఠిక అటువంటిది. పీఠికలో విషయ పరిచయంతో పాటు పీఠికాకర్త వ్యక్తిత్వం కూడ స్పష్టమవుతుంది.

పీఠికల ముఖ్యోద్దేశం కవిని, కావ్యాన్ని పాఠకులకు పరిచయం చెయ్యడం. తెలుగులో ఇది పీఠిక, పరిచయం, అభినందన మంగళాశాసనాలు, ఆముఖము, ప్రశంస, ఉపోద్ఘాతము, ప్రస్తావన, భూమిక, అవతారిక, ఆశీస్సు ఆమోదము మొదలైన పేర్లతో వ్యవహరింప బడుతోంది. సాధారణంగా కవి

స్వయంగా తన కావ్యానికి రాసుకున్న పీఠికను నివేదన, విజ్ఞప్తి, మనవి, విన్నపము, మున్నుడి, తొలిపలుకు, ముందుమాట మొదలైన పేర్లతో వ్యవహరించడం జరుగుతోంది. ఇప్పుడు వీటినన్నిటినీ పర్యాయ వాచకాలుగానే గ్రహిస్తున్నారు.

సాహిత్యంలో వెలసిన వివిధగ్రంథాలకు ప్రామాణిక, పండిత విమర్శకుల చేత పీఠిక రాయిస్తే కావ్యానికి సమకాలికులలో విశేషంగా గుర్తింపు వస్తుందని భావిస్తారు. అందువల్ల కవులు పెద్ద వారిని మొహమాట పెట్టో, అర్థించో సుముఖమైన పీఠికలు రాయించు కుంటారు.

పీఠికలను ప్రశంసలకు మాత్రమే పరిమితం చేయక కావ్య పరిచయాన్ని చేసేవారు, గుణదోష పక్షపాతంలేకుండా ఉన్నదున్నట్టుగా రాసేవారు అరుదుగా ఉంటారు. అటువంటి పీఠికలు వెలయించిన వారిలో రాళ్ళపల్లి స్థానం అద్వితీయం.

రాళ్ళపల్లి ప్రాచీన, ఆధునిక కావ్యాలకు, గేయకావ్యాలకు, నాటకాలకు, నవలలకు, వ్యాకరణ గ్రంథాలకు, పదసాహిత్య గ్రంథాలకు, విమర్శవ్యాస సంకలనాలకు, ఇంచుమించిగా వారికి సమకాలికముగా తెలుగులో వెలసిన అన్ని సాహిత్య ప్రక్రియలకు పీఠికలు రాశారు. ఇవన్నీ ప్రమాణీకంగా నిలవడానికి కారణం వారికున్న వ్యుత్పత్తి. దానితో పాటు నొప్పింపక, తానొవ్వక చేసె లలిత విమర్శ. అయితే, తప్పించుకుని తిరగడం మాత్రం ఆయనలో లేదు.

వీరు రాసిన పీఠికలను 1. స్వీయకావ్య పీఠికలు 2. ప్రాచీన కావ్య పీఠికలు 3. ఆధునిక కావ్య పీఠికలు 4. నాటకాలకు రాసిన పీఠికలు 5. విమర్శలు, పరిశోధనలు మొదలైన వానికి రాసిన పీఠికలు 6. సంగీత సంబంధ గ్రంథాలకు రాసిన పీఠికలు ఆనిస్థూలంగా విభజించవచ్చు.

<u>స్వీయకావ్య పీఠికలు</u>

తానుస్వయంగా పరిష్కరించిన కావ్యాలకు రాసిన పీఠికలు, స్వీయ రచనలకు రాసుకున్న పీఠికలు అని రెండు రకాలుగా గ్రహించవచ్చు.

రాళ్ళపల్లి రాసిన పరిష్కరణ పీఠికలలో, 'శ్రీమదాంధ్ర భాగవతము' 'పాండురంగ మాహాత్మ్యము' లకు రాసిన పీఠికలు విశిష్టమైనవి. వీరు ఈ కావ్యాలకు రాసిన పీఠికలు కావ్య పరిష్కరణ విమర్శకు సరితూగ గలిగేవి ఆధునిక విమర్శను కావ్యపరిష్కరణ విమర్శే మూలం. దీనినే ఆంగ్లంలో Textual criticism అంటారు.

"Textual Criticism, properly speaking, is an ancillary academic discipline designed to lay the foundations for the so-called higher criticism, which deals with questions of authenticity and attribution, of interpretation and of literary and historical evaluation ............................ ......... ... The essential task of the critic is not to try to reconstruct the "original" but to isolate those forms of the text that were current in partilcular centres in the ancient world" 7

రాళ్ళపల్లి రాసిన పరిష్కరణ పీఠికలలో మొదట తాను పరిష్కరణకై ఉపయోగించిన ప్రతుల వివరాలు, పిమ్మట పాఠనిర్ణయాలను కొన్నింటిని వివరణలతో చూపారు.

'శ్రీమదాంధ్ర భాగవత' పీఠికలో పోతనకు ఒంటి మిట్ట, ఓరుగల్లులతో సంబంధం ఉందని భావిస్తూ "అక్కడివాడు కాదని కాని, ఇక్కడివాడు కాదని కాని కొందరు చేసినట్లు నికరముగా సిద్ధాంతము నేను చేయలేను" (పు. 51)- అని తమ పరిశోధన దృక్పథాన్ని వ్యక్తీకరించారు.

పాడురంగ మహత్మ్యము ఉపోద్ఘాతములో పాఠపరిష్కరణ సమయంలో తానసుసరించిన విధానాన్ని ఈవిధంగా తెలిపారు.

"సరియైనవని తోచిన పాఠములను మూలమున కెక్కించి తక్కినవి యెట్టివైనను అన్నిటిని అడుగున చూపినాను. అచ్చుతప్పులు, వ్రాత తప్పులు అని స్పష్టముగా తెలిసిన వానిని మాత్రమే ఉటంకించితిని, ఇంతపై అవశ్యకమని తోచిన చిన్నసవరణలు ప్రశ్నగుర్తుతో చిప్ప గుర్తుల నడుమ సూచించితిని. నాపాలికి యసందిగ్ధముగానే నిలిచిన పదవాక్యముల ప్రక్క వట్టి ప్రశ్నచిహ్నము చిప్పల నడుమ (?) నిలిపితిని" (పు. 85).

అని వివరింఛారు,

తరువాత తెనాలి రామకృష్ణుని కాలదేశాదులను గూర్చిన చర్చల సారాంశాన్ని సంగ్రహంగా వివరించారు.

శ్రీమదాంధ్ర భాగవత పీఠిక, పాండురంగ మాహాత్మ్యము ఉపోద్ఘాతము, వావిళ్ల "వేమన పద్యము''లకు రాసిన పీఠిక, ప్రాచీన కావ్యపీఠికలుగా కూడ గ్రహించవచ్చు.

స్వీయకావ్య పీఠికలు

ఇవి అనువాదాలయితే మూలగ్రంథ వివరాలు, ఇతివృత్తాలకు సంబంధించి సమకాలిక సమాజంలో ప్రచలితంగా ఉన్న విషయాలు చెప్పారు.

''మీరాబాయి" పీఠికలో ప్రచలితమైన కథకు, ఈ పుస్తకంలోని కథకు తేడా ఉందని వివరిసూ మనస్సాక్షి ప్రమాణముగా దీనిని భేదాంతం చేశానని రాశారు. "గాథాసప్తశతీసారము''పీఠికలో అనువాదంలో తాను తీసుకున్న జాగ్రత్తలను ఈ విధంగా తెలిపారు.

మూలమును రచించిన కవులు, కవయిత్రులు, అందరి రచన సంప్రదాయమును ఒకటే. శబ్దార్థముల సంయమము, భావముల ఆర్జవము, అడ్డులేని సహజ ధారయు తెలిగించునప్పుడు పై అసాధారణ లోపము రానీయక తెలుగు పలుకుబడి చెడనీయక రచింపవలెననియే నా పేరాస; నా పరాయణము. అందుకై ఏకవృత్త నియమమును వదలి తెలుగు జాతికి సహజమైన ప్రియమైన ఆటవెలది, తేటగీతి, కందములందే నాకృషి యథానుకూలముగ సాగించితిని,'' (పు.209)

గ్రహించిన గాథలు తనఅభిరుచిని స్పష్టం చేస్తాయని, అన్ని గాథలు స్వీకరించక పోవడానికి కారణం వాని 'ప్రమేయం సౌమనస్య మర్యాదను మీరినట్లు' కన్పించటమేనని తమ ఔచిత్య దృష్టిని వెలువరించారు.

''నాట్య, నృత్య, నృత్తములలో దేనియందును నాకు ప్రవేశము చాలదు. ఉన్నస్వల్ప సంస్కృత భాషా పరిచయమాధారముగా మాత్రమే ఈతెనిగింపు సాగించితిని'' అని 'నృత్తరత్నావళి' ఉపోద్ఘాతములో వినయపూర్వకంగా చెప్పారు.

ఆధునిక కావ్యపీఠికలు

వీటిలో కవితోగల స్నేహం, పరిచయాల ప్రస్తావన, కావ్యవిషయ పరిచయం, విషయ విమర్శలో అభిప్రాయ భేదాల వివరణ, శబ్దార్థచర్చలు, సలహాలు, ప్రోత్సాహ సూచకమైన అభినందన ఈ పీఠికలలో కన్పించే సామాన్య లక్షణాలు.

'క్రొక్కారు మెఱుగు' అనే ఖండకావ్య సంపుటికి ప్రస్తావనలో ఖండ కావ్య, మహాకావ్య స్వరూప స్వభావాలు కూలంకషంగా వివరించారు. వీరు చెప్పే విషయాన్ని ఎంత స్పష్టంగా, ఋజుశైలిలో చెప్పగలరో ఈ పంక్తులు తెలియ జేస్తాయి.

> "సృష్టిలో పిన్న పెద్దలు రెండును స్వతంత్రములు. ఆవశ్యకములు, గుణదోషములు రెండును రెంటను గలవు. గొప్పవస్తువు నందలి గాంభీర్యము చిన్న వస్తువున కుండదు. చిన్నదానికి గల చెలువము గొప్ప దానికిరాదు...... శృంగార నైషదమునూఱిన శ్రీనాధుడే గేయ కమలముల వంటి చాటు పద్యముల నెన్నింటినో వెదచల్లెను. ... ...సంగ్రహము వీనికిని (ఖండ కావ్యములకు) విస్తరము వానికిని (మహాకావ్యములకు) స్వాభావిక లక్షణము పనికి మాలిన విస్తరము మహాకావ్యములలో నెంత దోషమో పని చెఱుచు సంగ్రహము ఖండ కావ్యములలో నంతకన్న దోషమగును" (పు. 124-125)

ఖండకావ్యాన్ని సహృదయ రంజకం చేయాలంటే మనసులో తీవ్రత ఉండాలని అప్పుడే కవి చేపట్టిన విషయానికి న్యాయం చేకూర్చగలడని సూచించారు.

ఖండ కావ్యాన్ని విస్తరంగా చేసేవారికి, మహాకావ్యాన్ని అస్పష్టంగా ననది కవిత్వమునకు జీవ ధర్మమనుట ఆధునిక భావకవులనేకులు మఱచిన విషయము" (పు. 129) అని హెచ్చరిక చేశారు.

"శివభారతము" నకు ఉపోద్ఘాతము రాస్తూ చారిత్రక వ్యక్తులు కవిభావనలో రమణీయంగా రూపు దిద్దుకుంటారని అన్నారు.

"ఇప్పటిమన చరిత్ర జ్ఞానము వట్టికొండ గుర్తుల గుంపు." (పు.138) చారిత్రక వ్యక్తుల యాధిభౌతిక స్వరూపము తెలిసికొనుటకు వీలు లేదంటిని గదా!...... అ ...తే" కవిత్వమందలి మహత్త్వమున కిదయొక ప్రధాన సాక్ష్యము, పాత్రముల యాత్మల వర్చస్సును చిత్రించి, వారిభౌతిక స్వరూపము తెలియదను చింతయే మనకు పుట్టనీక చేయుట" (పు. 140) అని చారిత్రక వ్యక్తుల పాత్ర చిత్రీకరణలో గడియారము వేంకటశేష శాస్త్రిగారు చూపిన మెలకువను అభినందించారు.

శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారి 'శ్రీ దండకరామాయణ' పీఠికలో ఆద్యంతము దండక ఛందస్సులో ఇంతటి గంభీర విషయాన్ని సరసముగా వర్ణించిన కవికి అభినందనలు తెలిపారు.

"కళాజీవి" పీఠికలో శ్రీ చెఱ్ఱూరి శ్రీనివాసమూర్తి గారి కవిత యందున్న అర్జవగుణమును ఈ విధంగా ప్రశంసించారు. "ఆర్జవగుణముచేత వీరి సుందరవస్తు ప్రపంచము విశాలమైనది. దృష్టిలోతుగా, విరివిగా ప్రసరించినది. సుఖముగలచోట సౌందర్యమున్నదను భావము అందరికిని సహజము. కాని సౌందర్యమున్నచోట సుఖమున్నదని భావింపగల్గుట తపస్వులకు మాత్రము సాధ్యము. భగవన్నిర్మాణ మంతయు లీలామయమే, సౌందర్యమయమే. విషామృత విభాగమిందులో లేదు. ఈ కవిగారీ రహస్యమును గుర్తించి యనుభవించినారు. (పు.147)

సి. నారాయణ రెడ్డిగారి "నాగార్జునసాగరము"నకు రాసిన మంగళాశాసనములో గేయ కావ్యాలకు ఆవశ్యకమైన 'కాలలయమగు మాత్రా నియమము మాత్రమేకాక నాదలయమగు స్వరనియమము'లను గూర్చి వివరించారు. నేటి గేయకవులు నాదమును పూర్తిగా వదలివేశారని, అర్థభావాల్లో లయమనుభవింపగోరే కవికి ఈ నియమాలు అలంకారాలుగామాత్రమే పనికొస్తున్నాయని వివరించారు.

'నాగార్జునసాగరం'లో లయను పాటించి ఏ రాగధాటిలోనైనా పాడుకొనేలా కవితను తీర్చారని శ్లాఘించారు.

ఇతివృత్తాన్ని గూర్చి మాట్లాడుతూ "రక్తిలోను, విరక్తిలోను సౌందర్యమున్నది. వికారముగూడ రెంటనుగలదు. రెండును పరస్పర సంస్కార పోష

కములుగా ఉండగలవు. ఉండవలయును. ఈ తత్వమును గమనింపక పోవుట చేతనే మన దేశమందు చార్వాకమతముతో గూడ బౌద్ధమతమును నశించి పోయినది. గురుదేవుడు పద్మదేవుడు ఇద్దరును శుష్కహరవాదులే వీరిరువురి నడుమ పరవశముగా నలిగినది శాంతిశ్రీ. (పు 164) అని గురుదేవుడు రక్తిలో సౌదర్యాన్ని గుర్తించనందున 'నాగార్జునసాగరం' వెలిసింది— అన్నారు.

విశ్వంగారి 'పెన్నేటిపాట' పీఠికలో రాయలసీమ చారిత్రక నేపథ్యాన్ని సాంఘికార్థిక స్థితు గతులను చక్కగా వివరించారు.

వి.వి యల్. నరసింహారావుగారి "ఆనందభిక్షువు" పీఠికలో ఆధ్యాత్మికత కావ్యానికి వన్నెతేలేదని భావిస్తూ-

"కావ్యమునందు స్ఫురింపజేయునది రసిక వస్తువేకాని, అధ్యాత్మిక తత్త్వముగా నుండరాదని నాయభిప్రాయము. తత్త్వ విషయముల నిట్లు శిల్పోపకరణము చేత శ్లిష్టాశ్లిష్టముగా స్ఫురింపజేసినవారు మనలో అనూచానముగా ఎందరో కలరన్నది నిజమే. కాని ఆ పద్ధతినే కావ్యరుచిగేణమై తత్త్వము అస్పష్టమై పోవు లోపమున్నదని నేను భావింతును. 'కాంతా సమ్మితముగా చేయు 'ఉపదేశము' కాంతముగానే యుండదగునని, సుగ్రాహముకాని వివాదాస్పదమైన తత్త్వముగా నుండరాదని నా నమ్మిక" (పు. 190) అని తన అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా వ్యక్తం చేశారు.

కలుగోడు అశ్వత్థరావుగారి 'సర్వజ్ఞుని వచనములు' పీఠికలో గ్రంథకర్త అనుసరించిన ఆశు రచనా పద్ధతి యుక్తముగా లేదని చెప్పారు. "కవితా శిల్పమునకు, అందును భాషాంతరీకరణమునకు నెమరు యెంత వేసిన నంత మేలు'' అని వివరణ ఇచ్చారు.

మహాకావ్య, క్షుద్రకావ్య రచనా విధానాన్ని వివరిస్తూ శ్రీ కుంటిమద్ది శేషశర్మగారి "శ్రీయతి రాజీయము'' (మొదటి భాగము) పీఠికలో ఇలా అన్నారు.

''కావ్యరచన రెండు ముఖ్యశాఖలుగా నుండును. ఒకటి తాత్కాలికముగా మన మనస్సులలోని కుళ్ళను, ఆళ్ళను, ఆశానిరాశలను, అసూ

యాభిమానములను వెలువరచునది. దీనిని ఆత్మాశ్రయమని పేర్కొం దురు. దీని కొలత చిన్నది ఈ క్షుద్రరచనలు మొదటినుండి మనలో వెలువడుచునేయున్నవి. తెనుగులో ఇప్పుడు విధివిరామములేక సాగు చున్నవి. రెండవది ప్రమాణములో పెద్దది. ప్రమేయము వివిధ సంద ర్భములలో వివిధ వ్యక్తుల నడవడులతో నిండియుండును. దీనియందు విషయభావన విషయిభావనకంటె లోతుగా విశాలముగ పరాశ్రయముగా సాగవలసినది. ఈ మహాకావ్యరచనకు చేయివేయగలవారు ఎప్పుడును కొందరే. ఆ పరరికాణయ ప్రవేశ యోగమున సిద్ధి పొందగలిగినవారు, కాలూని నిలబడగల్గినవారు ఏ యిద్దరో ముగ్గురో. (పు. 221-222)

చరిత్రను ఉన్నదున్నట్టుగా రాయడం చరిత్రకారులకే సాధ్యంకానిదని "రఘునాథీయము" పీఠికలో శ్రీ గడియారము వారి కృషిని ఏ దృష్టితో పరీక్షించవలెనో తెలియజెప్పారు.

"ఉండినది ఉండినట్లే నికరముగా వ్రాసి పెట్టుదుమనుట చరిత్రకారులు ప్రకటించుకొన్న "ధర్మధ్వజము". కాని అట్టివారి వ్రాతలందే అభిమాన మూలమున ఎన్నియో అనుక్తులు. దురోక్తులు, అతిశయోక్తులు, అత్యు క్తులును చొచ్చి చేరుకొని యుండుట నిశ్చప్రచమైనమాట. అంతో ఇంతో వేతలు తీతలులేని కేవల వాస్తవమైన చరిత్ర గ్రంథము మనము చూడలేని వింత. అట్టిచో ఉండిన దానికి తోడు ఉండవచ్చు దానిని, ఉండవలసిన దానిని గూడ ఉత్తరోత్తర ప్రాముఖ్యముతో చేర్చి తీర్చు కావ్యరచనను ఆ చరిత్ర దృష్టితో పరికించుట ఆ కవితా సరస్వతికి చేయు నపచారమగును" (పు. 242).

అని ఈ కృతిని కావ్యదృష్టితో పరికిస్తేనే తత్త్వం బోధపడుతుందని విశదం చేశారు.

మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యముగారి "శ్రీకృష్ణ తాండవము-గోపకాలాస్యము" పీఠికలో అభినందన పిమ్మట పాటింపదగిన విషయాలు చెప్పారు.

"అర్థభావములలోను పునరుక్తులు అందందు కానవచ్చి వాని కమనీయత పలచపరుచుచున్నవనుకొందును......కొన్ని శబ్దప్రయోగాలు పునర్వి

> మర్శింప దగినవి. 'పుల్కు' ధాతువు 'పులకరించు' అను అర్థములో నా దృష్టి కింతవరకు రానిది. మీరేమరల పరిశీలింతురని పూర్తిచేసి వదిలినాను. భాగలక్షణములలో ఒండు రెండు కొరతలు కానవచ్చినవి. నా స్పష్టోక్తులను మీరు మన్నింతురు'' (పు. 248)

అని నిష్పక్షపాతంగా తమ అభిప్రాయాన్ని వెలువరించారు.

శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారి ''ద్రోణప్రశస్తి''కి రాసిన పండితాభిప్రాయములో—

> ''పెండ్యాల వారి యపభ్రష్ట గ్రంథమును ఎంత ఖండించినను తగును. తామాపని చక్కగా చేసితిరి. అసలు ఆయన చిత్తవృత్తిని చెఱచినది కట్టమంచి రామలింగా రెడ్డిగారు. ఆయన వినోదప్రియుడు. విప్లవబుద్ధి కమక కొంత వినోదముగాను, మరికొంత నవ్యదర్శన ప్రీతితోను రెడ్డి గారు చేసిన వాదములకు ఆపాదమస్తకముగా వంగిసలాము కొట్టి పెండ్యాల శాస్త్రిలు కృత కృత్యమ్మన్యులైరి'' (పు 255)

అని కవిచేసిన ఔచిత్యనిర్ణయాలను ప్రశంసించారు.

''భైరవ కొండారెడ్డి గారి స్వప్న శీతాచలము నకు అభిప్రాయం రాస్తూ కవిగారికి పెద్దన ఆదర్శమని తెల్పి, తన అభిప్రాయాన్ని ఈ విధంగా చెప్పారు.

> ''శ్రీ కొండారెడ్డిగారికి ఆదర్శముగా నుండుటకు పెద్దనామాత్యుడు చాలడని నాయూహ, అనగా పెద్దనయందు నాకు గౌరవము లేదని, భావింపకుడు. కాని అతనికంటె ఉదాత్తకవులు కవిత్రయము వార నుట నేనుదాచు కోలేని భావము కవిత్రయము వారినే వెన్నుబలముగా కొని పెద్దన్న మొదలగువాడు కొంత క్రిందికిదిగినను, నిలువ గలిగి నారు. పెద్దన వంటివారినే అనుకరింప బోయినప్పుడు తారాశశాంకాదు లవతరించినవి. ఆకొరత ప్రకృత కవి కావ్యమందును కానవచ్చు చున్నదని నాచింత'' (పు. 258-259)

అని మొగమాటానికి తావీయక తమ వక్తిత్వాన్ని స్పష్టం చేశారు.

నాటికాలకు రాసిన పీఠికలు-

అవధానము చంద్రశేఖర శర్మగారి "ముద్రారాక్షసము" నకు ఉపోద్ఘాతము రాస్తూ నాటకకర్త ఈ అనువాదాన్ని మిక్కిలి ఓర్పు,నేర్పులతో సాగించారని ఆంధ్రీకర్తలలో ఆయన అధికారాన్ని శ్లాఘించారు.

"శ్రీశైల మల్లికార్జున మాహాత్మ్యము" నాటక స్థాపనలో కవిగారైన పైడి లక్ష్మయ్యగారికి తమకుగల పరిచయాన్ని, బాంధవ్యాన్ని తెలిపారు. ఆయన రచనా విధానాన్ని స్పష్టం చేస్తూ—

"రూపక శిల్పమునకు సంబంధించి నంతవరకు ఈ కవికి ధర్మవరము, కోలాచలము వారి రచనలే వరవడిగానున్న దనవచ్చును. వారివలె ఇందు పద్యములకు తోడు పాటలును చేర్పబడినవి. రెండును ఎగుడు దిగుళ్ళు లేక ధారతో సాగినవి. ఏపద్యములన్నియు రెండవమారు చదివి అర్థము చేసికోవలసిన అక్కరలేక సుప్రసన్నముగా అతుకుకొని యున్నవి" అని తమ సుముఖతను వ్యక్తం చేశారు.

విమర్శలు-పరిశోధనలు-వివిధవ్యాస సంపుటులకు వ్రాసిన పీఠికలు:

అనంతపురము నుంచి వెలువడిన 'వదరుబోతు' వ్యాసాలకు పానుగంటివారి "సాక్షి" వ్యాసాలతో సంబంధము లేదని స్పష్టపరచారు, 'వదరుబోతు' వ్యాస సంపుటికి ప్రస్తావనలో "సాక్షి", 'వదరు,బోతు' వ్యాసాల యందున్న తారతమ్యాల నీవిధంగా తెలిపారు.

"సాక్షి"కి 'వదరుబోత'నియు, వదరు బోతునకు "సాక్షి"యనియు వేళ్ళుండిన స్వరూపేచిత్ర్య మెక్కువగా నుండి యుండు నేమోయని యొక యూహతో చెడిని ......సాక్షిలో నున్నంత మాటల పాటవము, అడ్డు ఆపులేని నాగుబాము నడక, సందేహములేని సిద్ధాంతములు, గరుసు పాఱని గొంతుకుతో రచ్చలో నున్న వారికెల్ల వినవచ్చునట్లుగా చేయు రాద్ధాంతములు, ఇవివదరుబోతుకో కానరావు......
వదరుబోతు మార్గము కొంత వఱకు మృదువైనది. ధ్వనిప్రధానము

ఇరువురును తిట్లలో మేటులైనను "సాక్షి" తిట్లలోని తెగువ "వదరు బోతు" తిట్లక లేదు. వదరుబోతు తిట్లలోని తీపు "సాక్షి" తిట్లకులేదు. (పు. 286)

పుట్టపర్తి నారాయణాచార్యులవారి "ప్రబంధనాయికలు" ఉపోద్ఘాతములో రచయిత విమర్శలను గూర్చి నిష్పక్షపాత మైన అభిప్రాయాన్ని వెలువరించారు.

"నారాయణాచార్యులవారి వాక్కు-వణకు లేనిది. స్వతంత్రమగు భావనా బలము, తీవ్రములైన భావములు అడకువలేని యభిప్రాయములు, అనుభవ శూరుల లక్షణములన్నియు నిందుగలవు, తోచిన పొగడ్తను గాని, తెగడ్తను గాని వెనుదీయక విసరిచెప్పు నార్జవమీతనికి గలదు. ముఖస్తుతిగాని, ముఖ నిందగాని విద్యగా నేర్చిన పాతకమున బోనివాడు. అనుభవమునకు మితి, లోపము ఉండవచ్చును. కాని అది ఆరోపితము మాత్రముకాదు. భావోద్రేక ముతో ఇతని వాగ్ధార తెగదూకులు దూకుచుండును. ఆవేశములో కొన్ని అభిప్రాయములు అందదుకులుగా గానరావచ్చును. కొన్ని మాటలు కొంత కఠినముగా దొరల వచ్చును. కాని దానికి కారణము చారుదత్తుడు చెప్పి నట్లు యౌవనమత్రో పరాధ్యతిన చారిత్రదే (మృచ్ఛకటికమే)' (పు.290-291 నారాయణాచార్యుల వారి విమర్శ విధానాన్ని వివరించారు

సురవరము ప్రతాపరెడ్డిగారి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"కు రాసిన అభిప్రాయములో-తన అలోచన కంటె భిన్నముగా రెడ్డిగారి రచనలో ఉన్న వాటిని ఈవిధంగా వ్యక్తీకరించారు.

"చదివినప్పుడు నాకుస్ఫురించిన కొన్ని భావాలను తమ పునరాలోచన కోసము ఇందు సంగ్రహముగా మనవి చేయుదును. ఇది సూచన మాత్రమే విమర్శకాదని గ్రహింపవేడితిని"— అనిచెప్పి రచయిత కంటె తనకు భిన్నముగా తోచిన భావాలను, పలు శబ్దాలకు రచయిత చెప్పిన అర్థాలకంటె భిన్నమైన అర్థాలను వివరించారు. ఇవి ఔచిత్య వంతములని వేరుగా చెప్పనవసరము లేదు. ఈసమయంలో రాళ్ళపల్లి వారు ప్రదర్శించిన వినయము, సంయ్యమనము ఆయన విమర్శ వక్తిత్వానికి వన్నె తెచ్చేవిగా ఉన్నాయి.

శ్రీ బాలాంత్రపు రజనీ కాంతారావుగారి "ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము" పరిచయ వాక్యాలలో

"పరిశుద్ధమైన పరిశోధక దృష్టితో ఈ రచన సిద్ధమైనదని ఒక్క మాటలో దీని గౌరవమును చెప్పవచ్చును. ఆయా వాగ్గేయ రచనలపై వీరు కట్టిన విలువలు రెంటి యందును వీరికిగల సాధనానుభవాల నైశిత్యాన్ని స్పష్టపరుస్తోంది" (పు. 304) అని అభినందించి,

'భాషల యెల్లలన్నీదాటిన కర్ణాటక సంగీత ప్రపంచంలో ఇటువంటి అభిమానాలు ఎంత దుర్బలంగా ఉంటే అంత క్షేమం'(పు 305] అని హెచ్చరిక కూడా చేసి తమ భాధ్యతను నిర్వర్తించారు.

'మోవనాడు' నారదగానలోల శబ్దాల పుట్టుపూర్వోత్తరాలు, అర్థవిషయమైన చర్చలు విపులంగా చేశారు.

శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డిగారి 'భాసుని రామనాటక మూలములు' ప్రస్తావనలో యజ్ఞఫలము భాసుని రచనకాదన్న రచయిత అభిప్రాయము తనకెంతో తృప్తినిచ్చిందని చెప్పారు.

"సమగ్రాంధ్ర సాహిత్యం" 8వ సంపుటం పీఠికలో ఆరుద్రగారి కృషి శ్లాఘనీయము. ఇందుకని వారినెంత అభినందించినా తెలుగువారి కృతజ్ఞతా ధర్మం తీఅదు అని తగిన ప్రశంస చేశారు.

పింగళి సూరన్న అష్టదిగ్గజాలలో ఉండే అవకాశం ఉందని వివరిస్తూ తమ వంశ వృక్షాన్ని ఉదాహరణగా చూపారు, చెంబు, కందం మొదలైన పదాల పుట్టు పూర్వోత్తరాలు వివరించి. ఇంకాకొన్ని విలువైన సూచనలు చేశారు.

'సాహిత్య తత్త్వము- శివభారత దర్శనము' పీఠికలో శివభారత కావ్య కవితను గూర్చిదాని ప్రయోజనాన్ని గూర్చి చెప్పిన మాటలు——

"శివభారత కవిత విప్లావకము కాదు. ఉద్రేచకము గాదు. స్వంత వారిని సివమెత్తించు వావదూక పటహము గాదు. దాని జీవనాడి నన్నయ భట్టారకునికి ఏరాయణమైన 'మిత హిత సత్యావాక్యత; దాని భావాంబర

వీధి యెంతో పెద్దసత్యము, దానిని ధ్వనింపజేయు అర్థములు హితములు... దాని పరమోద్దేశము ఫలము, హృదయ సంస్కారము; సంఘ సంస్కారము గాదు. రేపటి శ్రేయమేకాని నేటి ప్రేయముగాదు"అని విమర్శకులగు సర్దేశాయి తిరుమలరావుగారు ఈ తత్త్వాన్ని ఆకళింపు చేసికొని చేసిన విమర్శనమని తీర్పు చెప్పారు.

పద సాహిత్యం మీద ఆకాలంలో అధికారికంగా మాట్లాడ గలిగిన అతి కొద్ది మందిలో రాళ్ళపల్లిది అగ్రస్థానం. వారి 'క్షేత్రయ్య పదాలు' అనే వ్యాసం ఈ విషయానికి నిదర్శనం

ఎన్. గంగప్పగారి "క్షేత్రయ్య పదసాహిత్యం" వేటూరి ఆనంద మూర్తి గారి "తాళ్ళపాక కవుల పద కవితలు— భాషాప్రయోగ విశేషాలు (2వ భాగం), రామలక్ష్మి ఆరుద్ర గారి "తాళ్ళపాక వారి పలుకుబళ్ళు" మొదలైన గ్రంథాలకు రాసిన పీఠికలు కూడా విలువైన సమాచారాన్ని పాఠకుల కందిస్తున్నాయి.

*సంగీత సంబధమైన పీఠికలు*

ఇది చాలా వరకు తాళ్ళపాక అన్నమాచార్యుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనల పరిష్కరణ పీఠికలు, తాళ్ళపాక అన్నమయ్య, తిరుమలయ్య, చిన తిరుమలాచార్యుని గేయ సంకలనాలకు రాసిన పరిష్కరణ పీఠికలు.

ఈ పరిష్కరణలో రాళ్ళపల్లి వారికి కొన్నింటిలో సహాయం చేసినది శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు.

తాళ్ళపాక వారి కీర్తనలలో అర్థభావ ప్రాధాన్యం, త్యాగయ్య కీర్తనలలో నాద ప్రాధాన్యం అధికమనే మౌలిక లక్షణాన్ని తెలియ జెప్పారు:

వేమరాజు భానుమూర్తిగారి "శబ్దప్రపంచానికి తిలకం దిద్దుతూ సంగీత కళలో నాద ప్రాముఖ్యాన్ని సవివరంగా చెప్పారు. నాద భేదాలను, స్వరభేదాలను, గమకాలను వివరించారు.

'రెండవ మూలద్రవ్యం కాలం — అని ధ్వని ఖండాలు సూచించే కాల ఖండాలే సంగీత కళలో లయం' అని పిలుస్తారని చెప్పారు.

కర్ణాటక, హిందూస్థానీ సంగీత భేదాలను ఈ విధంగా చెప్పారు.

'శుద్ధనాదంతో ఇంద్రియతృప్తి చేయడంలో హిందూస్థానీకి ప్రయత్న మెక్కువ. శుద్ధలయంతో గమక బద్ధమైన వింతనాద వాక్యాలతో హృదయం తాకే ప్రయత్నం కర్ణాటకంలో ఎక్కువ. దానికిదీ, దీని దీ త్యాజ్యమూకాదు; అనావశ్యమూ కాదు'' (పు. 369) అని రెంటి ప్రాధాన్యాన్ని విప్పి చెప్పారు. రెంటిలోను సమానంగా వ్యుత్పత్తి ఉండబట్టే అంత అధికారికంగా రాయగలి గారు.

ఈ పీఠికల నన్నిటిని సమగ్రంగా పరిశీలిస్తే రాళ్ళపల్లి వ్యక్తిత్వం, అభిరుచులు స్పష్టమవుతాయి. అడి గారు కదాఅని ఏదో వ్రాయటం ఆయ నకు చేతకాని విద్య, వీటిలో మచ్చుకు ఒకటీ, అరా కూడా ముఖస్తుతి రాతలు లేవు. ఆస్వాదనీయంగా ఉంటే మహాకావ్యమైనా ఖండకావ్యమైనాఆయన కంగీ కారమే.వివిధ సాహిత్య ప్రక్రియలపై సూచనప్రాయంగానయినా వ్యక్తంచేసిన అభిప్రాయాలు వారి విమర్శ వ్యక్తిత్వానికి వన్నెతెచ్చేటటువంటివే. సంకుచిత త్వానికి తావీయని సహృదయత మనకు ప్రతి పీఠికలోను కనిపిస్తుంది. అందు వల్లే పీఠికారచన చేయడంలో తరువాతి వారికి రాళ్ళపల్లి మార్గదర్శకంగా నిలిచారు. పీఠికలలోని విషయాన్ని చాలావరకు యథాతథంగా ఇక్కడ ఉద హరించటానికి కారణం రాళ్ళపల్లి శైలిలోని సూటిదనాన్ని, నిక్కచ్చిగా ఉండే అభివ్యక్తిని పరిచయం చెయ్యటం.

## వేమన

'వేమన' ను గూర్చిన పూర్వచరిత్ర మొదటి అధ్యాయంలో చర్చిం చాను. రాళ్ళపల్లి వేమనపై చేసిన పరిశోధనా ఫలితాలనే ఇక్కడ వివరిస్తు న్నాను.

రాళ్ళపల్లి వారి ‘‘వేమన'' వ్యాసాలు విస్తృత పరిశోధనా దృక్పథం తోను, వేమనకు సంబంధించిన వివిధ విషయాలను తర్కసహంగా చర్చించి రాసినవి. వేమన జీవితాన్ని అతని పద్యాల ద్వారా చెప్పడానికి ప్రయత్నించిన గ్రంథం ఇది. కవిజీవితాన్ని కావ్యార్థుల సమన్వయంతో చెప్పే

విమర్శగా అనుకోవచ్చు. కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శ(Biographical criticism) గురించి Encyclopaedia of poetry and poetics లో ఇలా ఉంది.

**"The assumption is that life and personality of the author down to the last apparently trifling detail, may provide an essential key to the understanding and thus the appraisal of his poetry ... .. ........ ...It is the temptation to use the life and works interchangeably to illuminate each other deducing the personality from the poetry and then judging the poetry in the light of the personality."8**

ఏ రకమైన చారిత్రక ఆధారాలు లేనప్పుడు కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శ తప్పనిసరి. ఇది ఎంత వరకు తత్త్వాన్ని చేబుతుందో, సత్యాన్వేషణ సాగిస్తుందో చెప్పడం కష్టం. కొన్నిమార్లు అన్వయం అసహజంగా ఉండవచ్చు. మరికొన్ని చోట్ల నిజాలే బయటపడటానికి అవకాశం ఉంది. అందులోను వేమన వంటి వానిపై ఈ విమర్శ రాసిన పద్యాలెన్నో తెలియదు. ఉన్న వాటిలో వేమన ఇవే రాశాడని చెప్పే ఆధారాలు లేవు. ముందుగా వేమన పద్యాలను గుర్తించిన తరువాతనే రాళ్ళపల్లి ఈ విమర్శను ప్రారంభించారు.

వేమన కాల దేశములు, వేమన సంసార స్థితిగతులు, వేమన కాలమందలి మత ధర్మముల స్థితి, వేమన యోగసిద్ధి మత- ప్రచారము, మొదలైన వానిని అతని పద్యముల ద్వారాను, రాయలసీమ ప్రాంతంలో స్వయంగా జరిపిన పర్యటనల ద్వారాను వివరించారు,

వేమన కవిత్వము, హాస్యము, నీతులు, అనే శీర్షికలో రాసిన ఉపన్యాసంలో కవిత్వ లక్షణాన్ని, వేమన కవిత్వంలోని విశిష్టతను, హాస్యాన్ని నీతిని వివరించారు.

మతస్థాపకులు గాని, మతబోధకులుగాని ఆంధ్రులై పుట్టి ఆంధ్రదేశంలో మత ప్రచారం చేయలేదని చెబుతూ వేమనను ఈ విధంగా పరిచయం చేశారు.

''వేమన యిందుకొక విధముగా అపవాద మనవచ్చును. 'తనకు తోచిన తత్త్వమును నిర్భయముగా, ప్రజల కందళికిని బోధించుటకై

ఆంధ్రదేశమంతయు నించుమించుగా తిరిగి యందందు మతములను స్థాపించి, తనకు తరువాత తన మతమందు నమ్మిక గలవారు కొంద ఱుండునట్లు చేయగలిగిన తెనుఁగు వారిలో నితడు ముఖ్యుడు ...... మత కర్తలు కాని మత ప్రచారకులలో మతకర్తల కున్నంత విలు వను, వ్యాప్తిని, కొంతవరకు సంపాదించు కొనగలధీరుడు వేమన (పు 8)

రామదాసు త్యాగరాజు, తాళ్ళపాక కవులు, క్షేత్రయ మొదలైన వారు తమ కీర్తనలు, పాటలు, పదాల మూలమున భక్తిని, మతాన్ని వ్యాపింప చేశారు. వారికి కూడా వేమన కున్నంత వ్యాప్తి రాలేదని, దానికి కారణం వేమన పద్యాలలోని భావతీక్షణత, అచ్చతెనుఁగు పద్యపునడక అని ప్రశంసించారు.

వేమన పద్యాల ద్వారా అతని సిద్ధాంతాలు నిర్ణయించాలంటే ముందు ఏవి వేమన పద్యాలో గ్రహించాలి అని వేమన పద్యాలు 'ఇవి' అని గుర్తించ టానికి కొన్ని సూచన లిచ్చారు.

"వేమనకు విరుద్ధము కాని యర్థభావములను ఇతరులును జేర్ప వచ్చును; వేమనయే సహజమైన స్వాచ్ఛంద్యము చేతనో, సన్నివేశము, వయస్సు, అనుభవము మొదలగువాని భేదము చేతనో, తానాడిన వానికి విరుద్ధములైన భావములుతానే యాడవచ్చును. కాని ప్రకృతి సిద్ధమైన శైలీ విశేషమును అతఁడు మార్చుకోలేడు; ఇతరులనువా దము చేయలేరు. శైలి కర్తయొక్క ముఖము వంటిది. అంతరంగ మెంత మారినను అదిమాఱదు. కారణాంతరములచే గొంత మాఱినను సత్వమును పూర్తిగా బోగొట్టు కొనజాలదు" (పు 11).

వేమన పద్య మకుటమైన 'విశ్వదాభిరామ వినురవేమ' అను దానికి చాలామంది చాలా రకాలుగా అర్థం చెప్పారు. వావిళ్ళ వారి 'వేమన' పద్యాల ప్రతికి రాళ్ళపల్లి పీఠిక రాస్తూ 'విశ్వతాభిరామ' అనే పాఠాన్ని గ్రహించారు. విశ్వతా = ప్రపంచత్వము - అనగా సర్వము తానై యుండుట దానిచే నభి రాముఁడు అనే అర్థం చెప్పారు. అయితే తరువాత ఆ వ్యాఖ్యానము ఇప్పు డనుచితముగ తోచుచున్నది—అని విశ్వమును = ప్రపంచమును ఇచ్చువాడు విశ్వదుడు = భగవంతుడు; అతనికి అభిరాముడు = ప్రీతి పాత్రుడు అనే

అర్థం మేలైనదని వివరించారు. ఈ మకుటార్థానికి సంబంధించిన 'అభి రామయ్య కథ' కాల్పనికమైనదని, తనకందు నమ్మకం లేదని తెలిపారు.

వేమన పద్యాల ప్రతులు చాలావచ్చినా 'అందందు కొన్ని యనావశ్యకమైన సవరణలున్నను, చిన్నదైనను ఇప్పటికిని బ్రౌనుదొర ముద్రణమే సర్వోత్తమమని చెప్పుటకు సిగ్గగుచున్నది' (పు 16) అని చెప్పారు.

వేమన కాల నిర్ణయానికి సంబధించిన వివిధ వాదాలను కూలంకషంగా చర్చించి వేమన కాలము పదిహేడవ శతాబ్ది మొదటి భాగమని నిర్ణయించారు.

వేమన నివసించిన ప్రాంతాన్ని గూర్చి 'ఇతడు కడప, కర్నూలు జిల్లాల వాడని బ్రౌను కాంబెలు మొదలగు వారివలె నేనును తలచితిని' అనితమ అభిప్రాయాన్ని స్పష్టం చేశారు.

వేమన ప్రయోగించిన వివిధ శబ్దాలు కన్నడ దేశానికి దగ్గరగా ఉన్న తెలుగు దేశంలోనే వాడుకలో ఉన్నాయని ఉదాహరణలు చూపారు. అంతేకాక వేమన పేర్కొన్న 'ఒసివిరాండ్రు' వీరశైవ సంప్రదాయం వలన వచ్చినవారు. వైష్ణవులలో కూడ కాలక్రమంలో 'బసివిరాండ్రు' మొదలయ్యారని, వీరు కన్నడ దేశానికి దగ్గరగా ఉన్న తెలుగు ప్రాంతంలో ఉన్నారని అన్నారు.

వేమన కాలజ్ఞానం రాశాడని శర్మగారికి నమ్మకంలేదు.

కవుల కావ్యాలను చూసి జీవితాన్ని రాయడం సమంజసంకాదు. రాయవచ్చు అని చెబితే కావ్యాల్లో చేసిన కల్పనలు అన్నీ నిజాలని భ్రమపడే అవకాశాలున్నాయి. అయితే వేమన కల్పనను కావ్యాలుగా రాసినవాడుకాడు. కాబట్టి ఇతని కవిత్వం ద్వారా జీవితాన్ని తెలుసుకోవచ్చునని భావించారు. దానికి సమర్థనగా 'స్వానుభవ మీతని కవిత్వమందలి జీవగుణముఅని అనుభవానికి రానిదాన్ని దేన్ని కవితగా చెప్పలేదని భావించారు.

వేమన 'ప్రభురెడ్ల' కులానికి చెందినవాడని నిర్ణయించారు. దీని కాధారంగా 'కలియుగముననున్న కాపు కులానకు, వేమన తన కీర్తి విక్రయించె'- అనే పద్యాన్ని ఉదాహరించారు.

వేమన భారతము, రామాయణము, బసవపురాణము, శివపురాణము మొదలైన గ్రంథాలు అర్థంచేసికొని చదివినట్లు చెప్పారు. విద్యా సంస్కార

మున్నది గనుక పల్లెటూరిలోని ఇతరులవలెగాక 'ఆటవెలది'లో రచనలు చేశాడని చెప్పారు.

"గంగాధరుడే దైవము, సంగీతమె చెవుల కింపు..."
"విద్యలలోపల నీతియు, వాద్యంబులలోన వీణ..."

అని చెప్పడం వలన సంగీత జ్ఞానము కూడ కలదని భావించారు.

వేమనకు 'తోడిరాగం' అభిమాన పాత్రమైనదని ఇది అతని మనో ధర్మాన్ని సూచిస్తుందని చెప్పారు. 'ఏమో చాలదను అతృప్తి, జుగుప్స, తనయశక్తిచే గలిగిన ధైన్యము, దానికితోడు కార్యసాధనము నందలి పట్టుదల, స్వాతంత్ర్య రక్తి'— ఇత్యాది భావాలు తోడిరాగము చూపుతుంది అని వివరించారు

వేమన కాలంలో సంఘంలో వేశ్యాలోలురు ఎక్కువ అని కాల, దేశ పరిస్థితులను చర్చించి, వేమన వేశ్యాలోలుడయినాడని చెప్పారు.

''అత్యుక్తులను, ఇతర సాధనములచే అసత్యములని తేలిన దానిని వదిలిపెట్టి తక్కినవాని నంగీకరించుట క్షేమము, న్యాయము. ఇక వేమన వంటి వేదాంతి వేశ్యజేఁజిక్కుట యసంభవమని తలుచుట యజ్ఞానము'' అని భావించారు. (పు.)

వేమన ఎట్టివాడైన అతని గుణములు గణింప దగ్గవి. ''నన్నడిగిన వేమన వలె పద్యము వ్రాయగల వాడెవ్వడైన నేడు లభించునేని యతనికి గావలసియున్న మనమందఱును చందా లెత్తి వేయిమంది వేశ్యలను సంభావన సమర్పింప వచ్చును." అని చెప్పారు.

వేశ్యాలోలుడయిన వేమనకు తల్లిదండ్రులు వివాహం చేశారు. కాని అది సుఖంగా పరిణమించ లేదని వేమన పద్యాలలో ఒకటి, రెంటిని ఉదాహరణగా చూపారు. భార్యతో కలహించడం వలన ఇల్లు నరక ప్రాయమైనది. వేశ్యాలోలత్వం వలన పేదఱికం సంభవించింది. అని భావించారు.

కొంత కాలానికి ధనం స్వార్థం కోసం అనే భావం వేమనలో నశించింది. పేదల సేవే పెరుమాళ్ళ సేవ అని భావించారు. ఎక్కడో ఒకరాజును కొలిచి విసిగి వేసారినాడని ఈ పద్యాన్ని ఆధారంగా చూపారు,

ఆ. ''ఎఱుక లేని దొరల నెన్నాళ్ళు కొలిచిన
బ్రతుకు లేదు వట్టిభ్రాంతి గాని
గొడ్డుటావు పాలు గోకితే చేపునా?''

బీదల జీవితాన్ని చూసి దయకలిగినా సహాయంచేయ లేక పోయాడు. అప్పు డతని మనసు రసవాద విద్యపైకి పోయింది. ఈ వాదంలో సిద్ధిని కూడా పొందాడని రాళ్ళపల్లి అభిప్రాయం.

మన పూర్వీకులు రసవాద విద్యలో కృషి చేశారని కొందరు నమ్మరు. అట్టివారికి రాళ్ళపల్లి వారిచ్చిన సమాధానం:

"ఇది యసత్యమని దృఢముగా నమ్మి మనమే నెమ్మదిగా నున్నాము. కాని, పరదేశము వారింకను ఈ విషయమై కష్టపడుచునే యున్నారు. ఇంతలోనే యెప్పుడో దీని తత్త్వము వారి శంఖములో, బడిరాగా అప్పుడా తీర్థమును మనము భక్తితో నెత్తిపై ప్రోక్షించుకొని పవిత్రుల మగుదుము. (పు. 54)

రసవాద విద్యలో కృషిచేసినవారికి వైద్యముకూడ తెలిసే అవకాశం ఉందని వేమన కుక్క కఱచి నపుడు చేయవలసిన చికిత్సను గూర్చి చెప్పిన పద్యం ఉదాహరణగా చూపారు.

వేమన గురువగు 'లంబికాశివయోగి' కంసాలి కులంవాడని ఊహించారు.

వేమన శైవ మతానుయాయుల కుటుంబంలో జన్మించాడు. లింగధారి. వీరశైవ మతాన్ని అనుసరించినట్లు కన్పిస్తుంది, వేమన తత్త్వ పిపాసను శైవ, వైష్ణవాలు రెండూ తీర్చలేకపోయాయి మూలతత్త్వము సుగుణ నిర్గుణాలకు ఒకటే అయినపుడు శివకేశవ భేదాలెందుకు? అని ఆలోచించి శైవులను. వైష్ణవులను ఇద్దరిని తిట్టినట్లు అతని పద్యాలు ఆధారంగా నిరూపించారు.

స్వధర్మచ్యుతులైన బ్రాహ్మణులను కూడ వేమన వదలలేదు. "ఇట్లు చెడఁదిట్టినను, తిట్టుటకు మూలము అసూయగాక వారి లోపములను దిద్ద

వలెనను నిష్కళంక శ్రద్ధయే యగుటచే అట్టి విప్రులుకూడ వేమనను గౌర వించిరి " అని చెప్పారు.

"చావు తెలియలేని చదువేటి చదువురా?" అని భావించి తనకు గలిగిన సందేహాలను తెలుసుకోవడానికి ప్రయత్నించాడు. శ్రీవైష్ణవము, వీర శైవము, శాంకరాద్వైతము ముఖ్యమైన మతభేదాలు.

వీరశైవంలో యోగవిద్యను ఎక్కువమంది ఆశ్రయించారని అన్నారు. అయితే అందరూ పూర్తిగా యోగాన్ని సాధించక పోయినా యత్నించిన వారి సంఖ్య అయినా ఎక్కువని భావించారు.

వేమన ఈ రసవాద విద్య నేర్చుకోవాలని, తత్త్వ జిజ్ఞాసతోను ఈ యోగుల నాశ్రయించి ఉండవచ్చునని అన్నారు. వేమనకు గురువుగారు హఠ యోగ విద్యలో ఉపదేశానిచ్చారు. పంచాక్షరీ, ద్వాదశాక్షరీ మంత్రాలు నేర్చుకున్నాడు. నాదశ్రవణం కలిగింది. కుండలీ యోగాన్ని కూడా సాధించారు. తేజోదర్శనం లభించింది. రాజయోగ పరమావధి అయిన అద్వైతానుభవాన్ని పొందిన వెంటనే హఠయోగ విద్యను విసర్జించాడు. లంబికా శివయోగి వేమనకు "వేద దీక్ష" నిచ్చెను.

> "వేమన్న యిట్లు వీరశైవ మతమందు బుట్టి, సంసార సుఖదుఃఖము లన్నియు ననుభవించి, రసవాద సంబంధమున శివయోగుల సహ వాసమునబడి విరక్తుడై హఠయోగమును సాధించి, యా పిమ్మట రాజ యోగియై, హరిహరాది సగుణోపాసన మీఱి, బ్రహ్మ సాయుజ్య రూప మగు అద్వైతానంద మనుభవించి జీవన్ముక్తుడైనాడని" (పు. 87)

వేమన పద్యములను ఆధారంగా గ్రహించి నిర్ణయించారు

వేమన తంత్రమార్గాన్ని అనుసరించాడని నమ్మకం లేదన్నారు. "ఇతని సిద్ధాంత మద్వైతము; సాధనకు హఠయోగ మూలమగు రాజయోగము. హఠ సాధన వేళలో కొన్ని తాంత్రిక మార్గముల నాశ్రయించి నుండవచ్చును అందును వజ్రోళి మొదలగు అసహ్యసాధనలితడు చేసినాడని నేనమ్మను" (పు. 89) అని వివరించారు.

వేమనలో సృష్టిసిద్ధంగా ఉన్నస్వభావం ఉద్రేకమని స్త్రీలను గూర్చి చేసిన వ్యాఖ్యలు ఇటువంటి ఉద్రేకానికి నిదర్శనాలని భావించారు.

స్త్రీ భోగ్యవస్తువని, మగవానిని చెఱుచుటకే సృష్టింప బడిందనే సంఘంలో వేమన పెరిగాడు. మీదుమిక్కిలి స్త్రీల కారణంగాచాలాకష్టాలు అను భవించడం వలన, మనోనిగ్రహానికి విఘ్నాలుగా భావించి స్త్రీ జాతిని తిట్టిన పద్యాలు ఉన్నాయి.

వేమన మత సిద్ధాంతములను గూర్చి ఇలా చెప్పారు. ''అసలతని మతసిద్ధాంతములు చదువుకొన్న వారికే యర్థము గానివి. వాని యందేదేని సత్యము గల దేని యది యితనివలెనే కష్టపడి దేహమును మనస్సును దండించిన వానికితప్ప ఇతరుల కనుభవమునకురాదు.'' (పు.)

పాత కాలపు సాంఘిక సిద్ధాంతాలు నచ్చవు అన్నిటినీ పూర్తిగా మార్చాలి అన్న నిశ్చయంతోచేసిన ప్రచారం ఎక్కువగా కన్పిస్తుంది.

వేమన, సామాన్యజనులకు తత్త్వవిచారణ యందరాని పండని గుర్తించి ఈశ్వరుడొక్కడు కలడని మాత్రము తెలిపి, అతనినెఱుగుటకును, పరోపకార మునకును తమ మనసు నెమ్మదికిని పనికివచ్చు నియమములను మాత్రము నిత్యముగా నాదరింపుడని సర్వమత సారమును శిష్యుల కుపదేశించినట్లు కానవచ్చు చున్నది. (పు.) అని వేమన మతప్రచారాన్ని వివరించారు.

వేమనవంటి వారగు సర్వజ్ఞమూర్తి, తిరువళ్ళువరు, పోతులూరి వీర బ్రహ్మం, వేగంటివారు, ఆనంద వరద రాజయోగి, ముత్యాల నారసింహ యోగి మొదలగు వారితో పోలికలు, భేదాలు చెప్పారు.

సర్వజ్ఞమూర్తి కన్నడ దేశము వాడు వేమన వలెఉద్రిక్త స్వభావం కలవాడు. సహజముగా కవితాశక్తి, హాస్య ప్రియత్వం కలవాడు. వేమనలో కనిపించే అసంతృప్తి సర్వజ్ఞునిలో అంతగాకన్పించదు.

సర్వజ్ఞునికి సంగీతప్రవేశంఉంది. ''వీణలెస్స''అను రాగం అతనికి చాలాఇష్టం ధీరగుణాన్ని ఈ రాగంలో చక్కగా చూపించవచ్చుట.

సర్వజ్ఞుడు కార్యంలో, సంసార సుఖంలో ఆశకలవ్యక్తి కాబట్టి దానిని తీర్చు కొనటానికి కొన్నాళ్ళు రాజసేవ చేశాడు.

వేమన కంటె శివపక్షపాతం ఉంది జీవబ్రహ్మలకు భేదమే సర్వజ్ఞునికి అనుభవంలో తెలుసు. కాని వేమన పరిపూర్ణాద్వైతానుభవాన్ని పొందాడు. ఇతని కాలం, వేమనకాలం ఎప్పుడో ఇంకానిర్ధారణ కాలేదని, కొన్ని పద్యాలు ఇరువురివీ ఒకేలా ఉన్నాయని చూపించారు.

సర్వజ్ఞుడు— కల్లుప్పు కర్పురవు నొల్లెరడు థాంతాందు,
ఖుల్ల నొళ్ళిదన రూపొందు, గుణదొళగె,
ఎల్ల అంతరవు సర్వజ్ఞ''

వేమన— ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడఁ జూడ రుచుల జాడవేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా.''

వీరిరువురి శయ్య ధారాళమైనదని, తెలిసిన పోలికలే కవితలో ఉంటాయని, ఏమిచెప్పినా స్పష్టంగా ఉంటాయని తెలిపారు.

తిరువళ్ళువరు తమిళదేశంలో జన్మించాడు. ఇతనిగ్రంథం తిరుక్కురళ్ ధర్మార్థ కామములనే మూడు పురుషార్థాలను గూర్చి రాసిన శాస్త్రం.

"సామాన్యములగు నీతుల విషయమున దప్ప వేమనకు నితనికిని పోలికలు లేవు, అతడు దుర్నీతి ఎక్కువగా ఖండించినవాడు. ఇతడు నీతి యిట్టిదని చెప్పినవాడు; అతనిది విరక్తి; ఇతనిదిరక్తి" (పు.105) అని తిరువళ్ళువరు రచన తిక్కన రచన వంటిదని చెప్పారు.

పోతులూరి వీరబ్రహ్మంగారు ఆంధ్రదేశంలో 17 వ శతాబ్ది మధ్యభాగంలో జన్మించారు. వేమన కవిత్వంలో ఉన్నంత వేగం, అచ్చుకట్టు ఈతని కవిత్వంలో లేదని ఉదాహరణ పూర్వకంగా వివరించారు

వేమన కవిత్వాన్నిగూర్చి, హాస్యాన్నిగూర్చి, నీతిబోధనుగూర్చి విపులమైన చర్చతరువాత నిర్ణయాలు చేశారు. ఇప్పటివరకు చేసిన కాల, దేశ, మత చర్చల వలె ఇది కూడా అతని పద్యాలను ఆధారంగా చేసుకున్నదే.

వేమన కవితకు భావతీక్ష్ణత, భాషాసారళ్యం పెట్టని ఆభరణాలుగా నిలచాయన్నది స్పష్టం. కవిత్వ సృష్టికి భావించేవాడు, అతని భావం, దానికి

విషయమైన వస్తువు, దానిని వెల్లడించుభాష, దానిని గ్రహించు సభ్యులు — ఈ యైదు అత్యవసరం అని రాళ్ళపల్లి అభిప్రాయం. భావాలు లేనిచోట తత్త్వశాస్త్రం, నీతిశాస్త్రం ఉండాలి తప్ప కవిత్వం ఉండటానికి అవకాశం లేదని చెప్పారు.

వేమన కవితలో స్పష్టత, సరళత ఉంటాయి. సంగ్రహంగా ఉంటాయి విషయం ఇతరుల మనస్సుకు నచ్చేదిగా ఉంటుంది. అందువల్ల ఆస్వాదనీయత వేమన కవితలో ఉన్నముఖ్యగుణమని విశ్వసించారు. సహృదయ లక్షణాన్ని ఇలా చెప్పారు:

"యే భావమైనను సంపూర్ణముగా ననుభవించు హృదయ సత్వము గలవారు సహృదయులు ఇట్టివారు కవిత్వమును విన్నప్పుడు తమ హృదయమును మఱచి కవిహృదయముతో చూడ గల్గుదురు...అప్పుడు ఇట్టిదని నిర్వచింపరాని యొక ఆనందము కలుగును. ఈ యానందము ప్రత్యక్ష సిద్ధమే కాని, ప్రమాణములతో స్థాపించి చూపుటకు సాధ్యము గాదు. ఇట్లు కవితా ప్రపంచమందును మమతాపరిత్యాగ పూర్వకమైన సాయుజ్యమే మోక్షానందమునకు కారణము'' (పు 117)

ముఖ్యంగా వేమన కవిత్వాన్ని ఆస్వాదించటానికి కావలసింది "వినువారి అహంకార త్యాగము వేమనవంటి స్వతంత్రుని కవిత్వమందలి మాధుర్యమనుభవించుట కదిలేనిది సాధ్యముగాదు'' అని వేమనను సంపూర్ణంగా అర్థం చేసుకోవాలంటే కావలసిన లక్షణాలను వివరించారు.

వేమన బహిరంగిద్వేషి. అంతరంగమందు శ్రద్ధ కలవాడు. ఈతని కవిత్వంలో పైమెరుగు లుండవు. నిర్భీతి, భావతీవ్రత ఎక్కువ. ఆటవెలదిని ఆయుధంగా గ్రహించాడు. యతినియమాలు పాటించడంలో తిక్కన కన్న మెలకువ చూపాడని వేమన కవిత్వ స్వరూప స్వభావాదులను సమీక్షించారు.

వేమన కవిత్వానికి మెఱుగు పెట్టిన గుణం హాస్యం. ఈ హాస్య లక్షణాన్ని ఈ రకంగా వివరించారు.

"హాస్యమునకు మూలప్రకృతి యితరుల యందలి తప్పులను బైలు వెట్టుట. అందును తప్పు కలదను నభిప్రాయమే సామాన్యజనులకు లేనట్టి

చోటులందలి తప్పులను ఆకస్మికముగా బైటికి దీసినప్పుడు హాస్యమునకు బలమెక్కువ... బైట పెట్టుటలో గూడ మార్గమున్నది. హాస్యము గల్గించుటయు నొకశిల్పము. ఇటుక గారలతో మాత్ర మిల్లెట్లు గాదో యట్లే తప్పులు పట్టినమాత్రమున నితరులు నవ్వరు. ఆ రహస్యములు శిల్పిమాత్రమే యెఱుగును'' (పు.123 124) అని వేమనలో ఇట్టిశిల్ప నిర్మాణ నైపుణి కలదని భావించారు

వేమనలో అక్కడక్కడ హాస్యం కలుషితంగా (అసభ్యంగా) ఉన్నా చాలా వరకు స్వచ్ఛమైనదని ఉదాహరణ పూర్వకంగా వివరించారు. మచ్చున కొకటి.

ఆ. "పాల సాగరమున పవ్వళించినవాడు
గొల్లయిండ్ల పాలుకోరనేల?
ఎదుటి వారి సొమ్ము లెల్ల వారికి తీపు ..''

వేమనకు ఇంతకీర్తి కలగటానికి కారణం అతడు బోధించిన నీతులు. వీటిని రెండు రకాలుగా విభజించారు. 1. పరార్థాలు 2 స్వార్థాలు.

పరార్థనీతులలో వేమన కిష్టమైన గుణం ఔదార్యం. అన్నదాన, కన్యాదానాలను కూడ అభిమానించాడని చెప్పారు. అహింసావ్రతం, చేజిక్కిన శత్రువుని క్షమించి విడిచిపెట్టడం మంచివని భావించాడు.

ఇతడు బోధించిన స్వార్థనీతులలో స్వానుభవం, వివేకం ఎక్కువగా కన్పిస్తాయని వివరిస్తూ

అనువుగాని చోట అధికులమనరాదు
కొంచె ముండు టెల్ల కొదువగాదు
కొండ యద్దమందు కొంచెమైయుండదా?...

అనేపద్యాన్ని ఉదాహరణగా ఇచ్చారు.

వేమన సమగ్ర వ్యక్తిత్వానికి రాళ్ళపల్లి వారి నిర్వచనం:

వేమన ఆంధ్రులలో సాటిలేనివ్యక్తి. అతీంద్రియ ముతైన తత్త్వములను దెలిసి కొనవలెనను నాశ, వాని ననుభవ పూర్వకముగా సాధించు సాహ

సము, తనకు, దెలిసిన వానికి ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి సాధనమై ఇరు ప్రక్కలందును మఱుఁగలేని మంచి పదనుగల చురకత్తి వంటి కవితాశక్తి, దానికి మెఱుఁగిచ్చినట్టి సంకేత దూషితము కాని ప్రపంచ వ్యవహారములందలి— సూక్ష్మదృష్టి, గాయపుమందు కత్తికే పూసికొట్టినట్లు తిట్టుచునే నవ్వించు హాస్యకుశలత'' (పు 1) కలవాడు,

రాళ్ళపల్లివారు "వేమన" వ్యాసాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలు విమర్శనీయాలని చాలమంది భావిస్తున్నారు. అయితే ఇక్కడ సహృదయ విమర్శకులందరూ గమనించవలసిన విషయం ఒకటుంది. వేమన వ్యాసాలు విస్తృతమైన పరిశోధనతో దొరికిన ఆధారాలను ముందుపెట్టుకొని సమగ్రమైన అవగాహనతో రాసినవి మారుతున్న కాలంతో పాటు విషయానుశీలన విధానాలు మారడం సహజం ఇప్పటి వారిదృష్టి రాళ్ళపల్లికి లేదనడం సమజసం కాదు. ఆకాలానికది ప్రామాణికం. తరువాతి పరిశోధకులకు మార్గదర్శకంగా నిలిచింది. దానినే భిత్తికగా నేటి పరిశోధకులందరూ గ్రహించాలన్న సత్యాన్ని మనం మరవకూడదు. లభించిన ఆధారాలనూ బట్టి చెప్పగలిగిన విషయాన్ని సమర్థంగా చెప్పారు. రాళ్ళపల్లి.

# ముగించే ముందు

సాహితీ లోకంలో ఒక ప్రత్యేక వ్యక్తిత్వంతో, సాహిత్య విమర్శ ప్రస్థానంలో తనదైన స్థానాన్ని నిలుపు కొన్న రసిక విమర్శకులు, సరసులు రాళ్ళపల్లి. అనుశీలనలో సౌందర్యాన్వేషణ చేసి వినూత్న మార్గాన్ని నిర్మించారు.

సంగీత, సాహిత్యాలలోని సౌందర్య రహస్యాలను వస్తు, భావ, రస రచనా కళలుగా సమన్వయించి నూత్న సిద్ధాంతాలను ఆంధ్ర సాహిత్య విమర్శకు అందించారు. వారి ఉక్తిలోని చమత్కారం, విమర్శలలో కన్పించే వ్యుత్పత్తి, చర్చలలో కన్పించే నైపుణ్యం, సమన్వయంలోని సహృదయత పఠితలను ముగ్ధులను చేస్తాయి. సహృదయత, నిర్భీతి, భావతీక్ష్ణత వీరి విమర్శలలో అడుగడునా పలకరిస్తాయి.

కవిత్వానికి భావాలు ప్రాణధర్మాలు అని చెప్పడం, భాషలో సారళ్యం ఉండాలని, ఔచిత్యం మీరకూడదని చెప్పడం సౌందర్యదృష్టికి నిదర్శనం. ఇతి వృత్తం ఏదయినా కవితలో ఈ మూడు లక్షణాలుంటే ఆస్వాదనీయత పెరుగుతుందనేది రాళ్ళపల్లి నమ్మిన సత్యం. కవితా విమర్శకు వీరి దగ్గరున్న కొలత బద్దలు ఈమూడే. నాచన సోమన, ఎఱ్ఱనల తులనాత్మక పరిశీలనలో కూడా భావ కళకు పట్టం కట్టింది ఈ దృష్టితోనే, వేమన కవితలోని విశేషాలను విప్పి చెప్పింది ఈ దృక్పథమే.

వీరి విమర్శలోని సృజనాత్మకత చెప్పే విషయానికి ఆత్మీయతా ముద్ర వేస్తుంది. అందువల్లే విమర్శకులు రాళ్ళపల్లి అభిరుచి విమర్శలో అత్యుక్తు లెక్కువగా ఉంటాయని భావిస్తారు. కాని ఇక్కడొక విషయం గమనించాలి. రాళ్ళపల్లి విమర్శలు అత్యుక్తులను మోసుకొని సహృదయుని ముందుకురావు. వాటి ఉద్దేశాన్ని మరింత సావకాశంగా ఆలోచించాలి. నిజానికి రాయలనాటి సామాజిక జీవనాన్ని గురించి చెప్పిన విషయాల్లో ఆ కాలపు వారి అలవాట్లను మెచ్చుకొనడం కన్న వారిని, నేడు లోపించిన దాన్ని గుర్తు చేయటమే ముఖ్యోద్దేశం అనిపిస్తుంది.

విమర్శలో రాళ్ళపల్లి స్వతంత్ర దృక్పథాన్ని ప్రకటించారని కవిత్వాను శీలనకు ఆయన ఏర్పరచిన మూడు లక్షణాలు స్పష్టం చేస్తున్నాయి. ఆ మూడూ ఉంటే అలంకారాలు, గుణాలు ఉన్నా లేకపోయినా కవిత వీరికి అంగీకారమే.

ఏ కవి కావ్యం చదివినపుడు ఆ కవితో తన్మయత ననుభవించటం వలన అనుశీలనలో న్యాయం చేకూరుతుంది. తాననుభవించిన ఆనందాన్ని కవిభావాన్ని చెప్పటం వీరి విమర్శల ఉద్దేశం. ఎవరి మెప్పుకోసమూ కాక తనకు నచ్చిన దాన్ని న్యాయమని భావించిన దాన్ని వ్యక్తీకరించటం వలన కవికి, కావ్యానికి అన్యాయం జరుగదు.

నాటకోపన్యాసాలలో రాళ్ళపల్లి వ్యక్తీకరించిన అభిప్రాయాలు ప్రాచ్య పాశ్చాత్య సమన్వయానికి నిదర్శనాలు. మిశ్ర పాత్రల విషయంలో వీరి అభిప్రాయం గణింపదగింది, నీతిని నాటకాల్లో కావ్యాల్లో బోధించటం మంచిదే కాని ఈ నీతి బోధ ఎప్పుడూ తెరమరుగున ఉంటేనే మంచిదని అన్నారు. ఈ అభిప్రాయం రాళ్ళపల్లి కళా సౌందర్య దృక్పథానికి, ఔచిత్య పరిగణింపుకు నిదర్శనం.

ఖేదాంత నాటక విషయంలో కూడా రాళ్ళపల్లి దృష్టి ఉచితంగాఉంది. అట్లాగే ఖేదాంతాల విషయంలో పాశ్చాత్యుల దృష్టిని కూడా వీరు పూర్తిగా సమర్థించ లేదు

వీరి పీఠికలలో గాని, వ్యాసాలలోగాని, వేమనలో గాని కన్పించే మరో లక్షణం ఔచిత్యం. ఈ విమర్శ అనౌచిత్యంగా ఉందని, ఎక్కడా చదువరుల కనిపించదు. దీనికి కొంత వరకు కారణం వీరిశైలి, రెండోది పాలను, నీటిని వేరుచేయగల రాజ హంసవలె ఉన్నదాన్ని ఉన్నట్టుగా చూపే వీరి నిజాయితీ, చెప్పేటప్పుడు భావాలకున్న స్పష్టత. కవికి భావ తీవ్రత ఎంత అవసరమో విమర్శకునికి భావ స్పష్టత అంత ఆవశ్యకంగా ఉండాల్సిన గుణం. వీరి విమర్శలలో భావం ఎంత తీక్షణంగా ఉంటుందో భాష అంత సరళంగా ఉంటుంది. చెప్పే విషయం సూటిగా మనసులో నాటుకొనేటట్టు చెప్పడం వీరి విమర్శల ప్రత్యేకత, ఉదహరణకు:

"......మనుషుడు శాశ్వతముగా నిర్మించు కొన్న వస్తువులలో గొప్పది చెత్త బుట్ట; అందలి సరకును ఏ గాలియో ఊడ్చికొని పోవును." (పీఠికలు. పు. 222)

''తాతల మతము, తము బోషించు పాళయగాంధ్ర మతము, ఈ రెంటి నను సరించుటకు, బోయి యాంధ్ర కవులు తమ సారస్వతమును నలుదిక్కుల బంధించిరి" (పీఠికలు పు.1)

''శతకముల నింకను మనము చదువనేర్చిన వారు చదువ వలసిన పుస్తకముల గుంపులో చేర్చుకొనలేదు!'' (పీఠికలు. పు.181)

తులనాత్మక పరిశీలనలో శర్మ గారిదే అందె వేసిన చెయ్యి. నాచన సోమన, ఎఱ్ఱన కవిత్వాల తులనాత్మకత, వేమన సర్వజ్ఞుడు, తిరువళ్ళువర్ ల పోలికలు భేదాల పరిశీలన ఇందుకు మచ్చుతునకలు. ఎవరికి వారిని వారి వారి కవిత్వ స్వభావాన్ని బట్టి రూపు కట్టించి పాఠకుల ముందు నిలిపారు.

వీరి విమర్శలలో కన్పించే మరో విశిష్టత అభిరుచి ధోరణితో పాటు పలుకోణాల నుంచి విషయ పరిశీలన చేయటం, తన మార్గాన్ని అంతా అనుసరించాలి; తను చెప్పిందే వేదం అనే సంకుచితదృక్పథం లేదు. సహేతుకమైన దాన్ని అంగీకరించటానికి వెనుదీయరు. ఈ సత్వశీలం వారి వ్యక్తిత్వాన్ని ఎంత ఉత్తమంగా తీర్చిదిద్దిందో అంతగా వారి పాండిత్యానికి వన్నె తెచ్చింది.

ప్రాచ్యలాక్షణికుల, పాశ్చాత్య లాక్షణికుల అభిప్రాయాలను పెద్దలు చెప్పారుగదా అని అనుసరించలేదు. తనకు ఆ అభిప్రాయాలు సరిపడతాయా లేదా అని ఆగి మరీస్వీకరించారు. ఒకసందర్భంలో దీన్ని స్పష్టం చేశారు. "నారుచికి పెద్దల వాక్యములు సరిపోవునాయని చూడ ప్రయత్నించు వాడను నేను.''

ఔచిత్య పూరితమైన ఆలోచన, నచ్చిన విషయం ఎక్కడున్నా గ్రహించే శీలం వీరి సమన్వయ దృష్టికి రాణింపు నిచ్చాయి. తనకు నచ్చని విషయం, ఔచిత్య దూరమైనవిషయం ప్రాచ్యదృక్పథమైనా, పాశ్చాత్యమైనా ఒకటే వీరికి.

తన అభిరుచికి తగిన విధంగా, సహృదయత వీడకుండా వీరు విమర్శలు నిర్వహించారు. పాత, కొత్త భావాలను తన వాదానికి అనుకూలంగా మలచుకొని ఔచిత్యం మేర మీరకుండా నిర్వహించిన నేర్పు అనన్య సాధ్యం. విమర్శలో పాతకొత్తల మేలు కలయిక వీరి ప్రత్యేకత. అభివ్యక్తిలో సంయమనం, అక్షరం పొల్లు రానీయకుండా రాయటం వీరికి వెన్నతో పెట్టినవిద్య. కట్టమంచి వారిలో వలె ఆవేశంకాని, కటుత్వంకాని చోటు చేసుకోదు. ఎదుటి వారికి నచ్చనివిషయం, యదార్థం అయినదాన్ని ఆయన వ్యక్తీకరించేతీరు వేరు.

నన్ను గురించిన నిడదవోలు వారి చెనుకు' అనే వ్యాసంలో నిడదవోలువారి విమర్శకు సమాధానమిస్తూ "శ్రీవేంకట రావుగారి గ్రంథ వ్యాసాంగము విశాలమైనది.వ్యవసాయము విసుగులేనిది దానిఫలము పూర్ణముగా ఆంధ్ర సాహిత్యమునకు లభించుటకై వారుతమ అభిప్రాయములను, రాద్ధాంతములును కొంత ఆత్రపడక నెమరు వేసుకొని వెలువరుచుట కావలసి యున్నది.'' విమర్శలో ఇంత సంయమనం, పదును రాళ్ళపల్లి వారి వ్యక్తిత్వంలో సహజంగా ఉండి రచనలో ఒదిగిపోయిన లక్షణం.

శర్మగారి రచనలో అక్కడక్కడ చురుక్కు మనిపించే హాస్యం చిప్పిలుతుంది. ఎంతటి విషయాన్నయినా తీవ్రఖండననయినా చదవగానే చిఱునవ్వు పెదవులపై కొచ్చే విధంగా చెప్పే నేర్పుఅనన్యసాధ్యం. ఒక ఉదాహరణ, వేమన నివసించిన ప్రాంతాన్నిగూర్చిన చర్చ సందర్భంలో —

''ఇక నేయితర స్థలములందు గాని వేమన నివసించి నట్లు ఇంత కంటె ప్రబలములైన సాధనములుండెనేని, యవి నాకు తెలిసిన వెంటనే అవశ్యముగా ఆయూరికి విచ్చేయమని వేమన్నను పల్లకీలో మోసి యక్కడికి సాగనంపుటకు నేనుమొదటి బోయీగా నిలుతును.''

రాళ్ళపల్లికి తిక్కన అభిమానకవి. తిక్కన భారతం 'ఆనంద' నామాంకితమైనదని మొదటచెప్పినది వీరే. తిక్కనకవితలోని అల్పాక్షరాల అనల్పార్థ రచన, స్పష్టత రాళ్ళపల్లి వారి కాదర్శాలు. 'గాయపు మందు కత్తికేపూసి' నవ్వించగల నేర్పు ఉంది వీరిశైలిలో, ఎటువంటి అల్పత్వానికి వీరి జీవితంలో కాని, రచనలోకాని స్థానం లేదు.

సౌందర్య మీమాంసా దృష్టితో చేసిన విమర్శలు దువ్వూరి రామిరెడ్డి వంటి వారికి మార్గదర్శకాలయ్యాయి.

అభిరుచి విమర్శలో ఔచిత్యాన్ని పాటించిన విశిష్టత రాళ్ళపల్లిది. వీరికి వివిధ శాస్త్రాల పరిచయం ఉన్నట్టు పీఠికలు, విమర్శలద్వారా తెలిసికోవచ్చు. చరిత్ర, తత్త్వ శాస్త్రాలను గూర్చిన చర్చలు అక్కడక్కడ కన్పిస్తాయి. పక్షపాతాన్ని వదలి చేసే వ్యాఖ్యలు ఈ చర్చల్లో కన్పిస్తాయి.

ఆధ్యాత్మిక చింతన కలవ్యక్తి రాళ్ళపల్లి అంతః శుద్ధి, నిరాడంబరత జీవలక్షణాలు. సంస్కృతం, తెలుగు, కన్నడం, ప్రాకృతం, తమిళం. ఆంగ్లాది భాషల పరిచయం వలన పాండిత్యంతో పాటు సంస్కారం కూడా వీరికి లభించింది. సంగీతాన్ని తపస్సుగా భావించి యోగంగా సాధించి సిద్ధిపొందారు. సహృదయత సంయమన శీలం కలిగిన ధీర వినయ మూర్తి రాళ్ళపల్లి. *

# జ్ఞాపికలు

## 1 జీవితము— రచనలు

1. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ : నాగురువులు (రాళ్ళపల్లి సన్మాన సంచిక) 1961, పు, 12.
2. ఘట్టమరాజు అశ్వత్థనారాయణ; రాళ్ళపల్లి వారి జీవిత చరిత్ర సంగ్రహము (అనంతరాగం) 1977. పు. 123
3. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; నాగురువులు (రాళ్ళపల్లి సన్మాన సంచిక) 1961, పు 14.
4. ఘట్టమరాజు అశ్వత్థ నారాయణ; రాళ్ళపల్లి వారి జీవిత చరిత్ర సంగ్రహము (అనంత రాగం) 1977, పు 135.
5. గౌరిపెద్ది రామసుబ్బశర్మ ; నేనెరిగిన రాళ్ళపల్లి వారు (అనంతరాగం) 1977 పు. 145 - 46.
6. బంగోరె, వేమన - సి. ఆర్. రెడ్డి 1981, పు. 25–37
7. దేవులపల్లి రామానుజరావు , నా యాభై సంవత్సరాల జ్ఞాపకాలు, 1981 , పు 119.
8. ఆర్వీయన్ సుందరం ; అలరుపలుకుల రాళ్ళపల్లి - ఆంధ్రప్రభ దిన పత్రిక 1982 నవంబరు 14.

## 2 తెలుగు సాహిత్య విమర్శ-రాళ్ళపల్లికి పూర్వరంగం

1. రాజశేఖరుడు ; కావ్య మీమాంస. పుల్లెల వ్యాఖ్యానం చతుర్థాధ్యాయం శ్లో॥ 14, 1979.పు. 42
2. కొత్తపల్లి వీరభద్రరావు ; తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావం. 1960 పు. 267.
3. పై పుస్తకం లోదే . 156-117

4. కోవెల సంపత్కుమారాచార్య ;ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ సాంప్రదాయికరీతి. 1981 పు.19.
5. poetry is the spontaneous overflow of powerful feeling; it takes its origin from emotion recollected in tranquillity.
6. కోవెల సంపత్కుమారాచార్య ; ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ, సాంప్రదాయిక రీతి. 1981 పు. 89
8. జి.వి సుబ్రహ్మణ్యం; ఆంధ్రసాహిత్య విమర్శ ఆంగ్ల ప్రభావం 1983 పు. 184.
9. ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం. పు 186-187.
10. రాజశేఖరుడు; కావ్య మీమాంస (1976) చతుర్థాధ్యాయం శ్లో —పు 35
11. పై పుస్తకంలోదే. శ్లో —115 పు 41
12. జి.వి. సుబ్రహ్మణ్యం: ఆంధ్ర సాహిత్య విమర్శ ఆంగ్ల ప్రభావం 1983 పు 183.
13. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; నాటకోపన్యాసములు 1925 పు 4.
14. పై పుస్తకంలోదే. పు 4
15. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; కవిత, ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక) 1912.
16. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ;నాటకోపన్యాసములు 1935. పు 13.
17. "...కళయందు రెండు గుణములు, జూపింప వచ్చును, సుఖము చమత్కారము. శిల్పముయొక్క యభిమతము సుఖముగాని చమత్కారము గాదని చెప్పనేల?"
కట్టమంచి రామలింగారెడ్డి; కవిత్వతత్త్వవిచారము 1981,పు 59
18. జార్జిశాంతాయన, ది సెన్స్ ఆఫ్ బ్యూటీ. 1896. పు38
19. జి.వి. సుబ్రహ్మణ్యం; ఆంధ్ర సాహిత్య విమర్శ— ఆంగ్లప్రభావం 1981 పు 180-181
20. కాల్పనిక యుగ సాహిత్య సమీక్ష ఆంధ్రసాహిత్య విమర్శ ఆంగ్ల ప్రభావం నుంచి తీసుకున్నది.

21. జి.వి.సుబ్రహ్మణ్యం-ఆంధ్రసాహిత్య విమర్శ-ఆంగ్లప్రభావం పు.182
22. పురాణం సూరిశాస్త్రి, ; విమర్శక పారిజాతము 1925
23. జార్జి శాంతాయన; సెన్స్ ఆఫ్ బ్యూటీ, 1896. పు 52
24. పురాణం సూరిశాస్త్రి; విమర్శక పారిజాతము 1925 పు 244-245
25. 'ప్రాత ప్రపంచము ననే ప్రాకులాడు చున్న నాకు వారితోడి సహవాసము ఆధునిక ప్రపంచపు తలుపులు తెరిచి ఆహ్వానించినది.' రాళ్ళపల్లి సన్మాన సంచిక పు-14.
26. సంస్కృత సాహిత్యంతో పాటు లలితములైన ప్రాకృత తెలుగు కన్నడ తమిళాంగ్లముల భావ వాహినులలో ఈదులాడుటయే గాదు. సంగీత గంగలో కొట్టులు వైచిన వారాయన. ప్రాకృత సాహిత్యమున పరిశ్రమ చేసిన శర్మ గారి 'అపురూపత' ఆయన నేర్చిన ఆంగ్ల నుడికారపు 'సొంపు' కన్నడమున గ్రంధరచన చేసి కన్నాకుగా నిల్చిన విన్నాణము ఎట్టిదో నేటికిని మనలో అనేకులు పూర్తిగా నెరుగరు" (అనంతకృష్ణులు అభిరుచి నిర్దేశము) సాళ్వకృష్ణమూర్తి రాళ్ళపల్లి సన్మాన సంచిక.పు 21

## 4. రాళ్ళపల్లి విమర్శలు

1. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; స్వభాషాభిమానమునకు సంగీతముతోనేమి గొడవ' భారతి 1941 అక్టోబర్.
2. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; ఆంధ్రగాయకజన సభాధ్యక్షోపన్యాసము 1927.
3. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; 'కవిత' 1912 ఆంధ్ర పత్రిక ఉగాది సంచిక.
4. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి; కావ్యాలంకార సంగ్రహము 1976. పు99
5. The Encyclopedia of poetry and poetics 1974-p168
6. కట్టమంచి రామలింగారెడ్డి, కవిత్వతత్త్వ విచారము 1981 పు 59.
7. Encyclopaedia Britannica 8th valume 1943-1973. p.189
8. Encyclopaedia of poetry and poetics. 1974.p. 169

# అనుబంధం I

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి కుమార్తె శ్రీమతి నాగమణిగారు చెప్పిన రాళ్ళపల్లి వారి జీవిత విశేషాలు.— (17—1—1983. 1.15 P M)

## రాళ్ళపల్లి వారి సాహిత్య జీవితం:—

తండ్రిగారి వద్దే సంస్కృతం, తెలుగు నేర్చుకున్నారు. ఇంగ్లీషు ఎవరిదగ్గరా నేర్చుకోలేదు తనే స్వయంగా నేర్చుకున్నారు అల్లునికి ఉత్తరాలు ఇంగ్లీషులో వ్రాసే వారు కుమారునితో తప్పులేమైనా ఉన్నాయేమో చూడమనేవారు.

సంస్కృతంనుంచి అనువాదం చేసేముందు మూలాన్ని నాలుగైదుసార్లు చదివి వ్రాసేవారు.

ప్రాకృతం కూడ ఎవరిదగ్గరా నేర్చుకోలేదు స్వయంకృషితోనే. ఆయన రచన మొదలుపెట్టాక ఆలోచించేవారుకాదు. అంతాముందే ఆలోచించుకొని ఆపకుండా వ్రాసే వారు. రేడియో ప్రసంగాలు, వ్యాసాలు మర్నాడు పోస్టుకి వెళ్ళాలంటే రాత్రి కూర్చుని వ్రాసేవారు. ఏదిచదివినా విమర్శమనసులో పెట్టుకుని చదివేవారు, ఈ విషయంలో ఆయనకి కట్టమంచి వారి స్నేహం చాలా లాభదాయకమైంది.

భారతం ఆయనకిష్టమైనగ్రంథం. తిక్కన అభిమానకవి. అప్పుడప్పుడు పిల్లలకి భారతాన్ని చదివి వినిపించేవారు ఏసమయంలో వచ్చిఅడిగినా, అడిగినవారి సందేహం తీర్చేవారు.

మతం:- వారికి మతపరమైన మూఢనమ్మకాలేమీ లేవు. ఉదయమే అయిదు గంటలకు లేచి స్నానంచేసి అన్నీతనే శుభ్రంచేసుకొని పూజ చేసేవారు. శ్రీవైష్ణవులు అయ్యంగార్లు. తిరుమణి, శ్రీచూర్ణంతో నామాలు పెట్టుకొనేవారు రామానుజం మతం ప్రకారం పూజాదికాలు ఆచరించేవారు. కాని ఈశ్వరుని గుడికి వెళ్ళకూడదు, ఈశ్వర ప్రసాదం తినకూడదు అన్ననియమం ఎప్పుడూ లేదు. రోజూ ఖచ్చితంగా ఇంత సమయం అర్చన చేయాలి అనుకోనేవారుకాదు దొరికినసమయాన్నిబట్టి, ఇంట్లో వాళ్ళని ఇబ్బందిపెట్టకుండా చేసుకొనేవారు దేవి ఉపాసన లాంటి వేమీ చేసేవారుకాదు. రోజూ రామాయణం పారాయణం చేసేవారు. నవరాత్రి సమయంలో దశమిరోజుకు రామాయణం అన్నికాండలు పారాయణం చేసేవారు.

ఆహారం పట్ల ప్రత్యేకమైన ఇష్టాయిష్టములు కనబర్చేవారు కాదు.

*సంగీతం* - సంగీతం చిన్నతనంలో తల్లిగారిదగ్గర నేర్చుకొన్నారు. మైసూరులో కనిగిరిరావుగారు శిష్యులకు నేర్పేటప్పుడు అదివిని, చాలావరకు నేర్చుకొన్నారు తరువాత శ్రీ బిడారం కృష్ణప్పగారి దగ్గర శిష్యరికం చేశారు. సంగీత సాహిత్య సభల్లో సంగీత కచేరీలు చేసేవారు. ఎన్నడూ డబ్బు తీసుకునేవారుకాదు బెంగళూరు, మైసూరు, తిరుపతి, కాకినాడ మొదలగుచోట్ల కచేరీలు చేశారు.

"గానరసమూర్తి త్యాగరాజు పాటలు తేనెంతేటలు—"అనే కీర్తన వీరి మొట్ట మొదటి స్వీయరచన. 12 కీర్తనలు, ఒక'తిల్లాన' వీరి స్వీయ రచనలలో ప్రసిద్ధమైనవి.

ఇంటివద్ద శిష్యులకు భోజనంపెట్టి సంగీతంనేర్పేవారు. తప్పుచేసినా విసుక్కోకుండా సరిదిద్దేవారు. తాతాచార్యులుగారు. కృష్ణమాచార్యులుగారు వీరిశిష్యులే.

సంగీతాన్ని తపస్సుగా భావించేవారు. భక్తికూడ సంగీతంలోనే ఎక్కువ. బాధగా ఉన్నప్పుడు, సంతోషంగా ఉన్నప్పుడు గంటలు, గంటలు తంబురా శృతి చేసుకోనేవారు. మనసు నెమ్మదించిన పిదప ఊరుకొనేవారు. ఎనభైయ్యవఏట కూడ సాధన చేసేవారు. నాకు ఇప్పుడిప్పుడే కొన్నిరాగాలు పట్టుబడుతున్నాయి అనేవారు.

*విశిష్టవ్యక్తిత్వం*:- వీరికి ధనంమీద వ్యామోహంలేదు. తన ఆస్తిఅంతా తమ్ములతో సమానంగా పంచుకొన్నారు. డబ్బుమూలంగా భేదాభిప్రాయాలు రాకూడదు అనేవారు.

ఎవ్వరితోను కఠినంగా మాట్లాడేవారుకాదు. అనవసర ప్రసంగం ఆయనకు కోపం తెప్పించేది.

ఆయనకు ఇతరులు తనననుసరించాలి, తనమాట వినాలి అన్నపట్టుదల లేదు "నాకునచ్చిన పద్ధతి నాది. నీకు నచ్చిన పద్ధతిలో నువ్వుండు" అనేవారు.

## అనుబంధం-II

# రాళ్ళపల్లి వారి రచనలు

గ్రంథాలు:-

| | | | |
|---|---|---|---|
| 1. తారాదేవి | (కావ్యం) | ప్రచురణ : | 1911 |
| 2. మీరాబాయి | (కావ్యం) | ,, | 1913 |
| 3. లీలాదేవి | (నవల) | ,, | 1913 |
| 4. శ్రీకృష్ణభూపాలీయము | (పరిష్కరణ) | ,, | 1924 |
| 5 శ్రీ మహిశూర రాజాభ్యుదయాదర్శ: | (సంస్కృత కావ్యం) | ,, | 1925 |
| 6. వేమన (1928) | (విమర్శ) | ,, | 1929 |
| 7. సారస్వతోపన్యాసములు | | ,, | 1931 |
| సారస్వతాలోకము | | ,, | 1954 |
| 8. శాలివాహన గాథాసప్తశతీసారము | | ,, | 1932 |
| 9 నాటకోపన్యాసములు | | ,, | 1935 |
| 10 తాళ్ళపాక సంకీర్తనలు | (పరిష్కరణ) | ,, | 1951-1976 |
| 11. గానకలె | (కన్నడ విమర్శ) | ,, | 1952 |
| 12 శ్రీమదాంధ్ర మహాభాగవతము | (పరిష్కరణ) | ,, | 1953 |
| సాహిత్య మత్తు జీవన కలె | (కన్నడ విమర్శ) | ,, | 1954 |
| 13. పాండురంగ మహాత్మ్యం | (పరిష్కరణ) | ,, | 1967 |
| 14. నృత్తరత్నావళి | (అనువాదం, పరిష్కరణ) | ,, | 1969 |
| 15. సుందర పాండ్య విరచిత ఆర్య | (అనువాదం) | ,, | 1970 |

## రాళ్ళపల్లివారి కవితలు, వ్యాసాలు ఉపన్యాసాలు :-

1. అజవిలాపము (కవిత), గ్రంథాలయ సర్వస్వము, సం 3 సం. 1
2. అప్పకవి కవితాసిద్ధాంతములు, పైదే సం. 6, సం. 1
3. అభీతిస్తవము, (కవిత) భారతి, సెప్టెంబరు 1962
4. అష్టమాంధ్ర నాటక కళాపరిషత్, అధ్యక్షోపన్యాసము
5. ఆంధ్రగాయక జనసభాధ్యక్షోపన్యాసము, భారతి, జనవరి 1928
6. ఆంధ్రులు—సంగీతము, ఆంధ్రపత్రిక (ఉగాది), 1950
7. ఆహ్వానము (కవిత), భారతి, అక్టోబరు 1934
8. కర్ణాటక గానశైలి—పవిత్రత, భారతి, మే 1939
9. కవిత (వ్యాసం) ఆంధ్రపత్రిక (ఉగాది), 1912
10. కుసుమ గుచ్ఛములు (కవిత), పైదే, 1922
11. క్షేత్రయ్య పదకవిత్వము, 1963
12. తిమ్మార్య వర్యుల వారి 'తెలుగు మెఱుగులు,' భారతి 1960
13. త్యాగరాజయ్య సాహిత్యము, ఆంధ్రపత్రిక (ఉగాది), 1940
14. "ధనంజయ ప్రవరకరమ్ము" భారతి, డిసెంబరు. 1961
15. 'నన్ను గురించిన నిడదవోలు వారి చెనకు' భారతి, నవంబరు 1969
16. నిన్నటి సంగీతము, భారతి, ఆగస్టు, 1941
17. నృసింహ పురాణ పారశోధన, ఆంధ్రపత్రిక (ఉగాది), 1869
18. "పదములు క్షేత్రయ్య" ఆంధ్రపత్రిక (ఉగాది),1942
19. పూజాసమయంలో అనువైన సంగీతం, సంస్కృతి, జూలై, 1953,
20. ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయములను కలుపుటకు వీలున్నదా?
 ఆంధ్రపత్రిక (దిన), 8 3:1939
21. భారతికి సాధువాదము (కవిత). భారతి,జనవరి 1949
22. భారతీయ సంగీతమందలి దక్షిణోత్తర మార్గములు, నాట్యకళ

23. మన సంగీత వాద్యాలు, ఆంధ్ర పత్రిక (ఉగాది), 1947
24. మహాకావ్య రచన— ఖండకావ్య రచన, భారతి, ఆగస్టు, సెప్టెంబరు 1934
25. రామన్న తరంలో సంగీతము, ఆంధ్రపత్రిక (దిన) 16·9 58
26. రాయలనాటి తెలుగు సాహిత్యము, భారతి, ఫిబ్రవరి, 1937
27. వాగ్గేయకారుడు అన్నమయ్య, వాణి, 7—11—1958
28. వాల్మీకే. గేయ పరిస్పందః (సంస్కృత ఉపన్యాసం), 1967
29. విస్మృత వేణుగీతి (కవిత), గ్రంథాలయ సర్వస్వము, సం. 1, సం, 3.
30. శమీపూజ (కవిత), పైదే, సం. 2, సం. 1.
31. సంగీత సాహిత్య పరిశీలన : సంగీత ప్రశంస, వాణి 7-10-1962
32. సంగీత—సాహిత్యాలు—అక్షర రమ్యత, భారతి, అక్టోబరు, 1940
33. స్వభాషాభిమానమునకు సంగీతముతో ఏమిగొడవ, అక్టోబరు, 1941

## వ్యాసములు

1. సారస్వతోపన్యాసములు (సమీక్ష), భారతి, ఆగస్టు. 1932
2. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ—ఆయన రచనలు, పుట్టపర్తి నారాయణాచార్యులు భారతి, నవంబర్ 1941
3. గాథాసప్తశతి - అనువాదాలు, టి.పి యన్ రామచంద్రాచార్య భారతి మే 1958
4. అనంతకృష్ణులు - అభిరుచి నిర్దేశము, భారతి, జులై, 1969
5. రాళ్ళపల్లివారి బాలక శతకము, భారతి, డిసెంబర్ 1972
6. శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ - కన్నడమూలం : శివరామకారంత్ · తెలుగు : ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, భారతి, జూన్ 1979
7. రాళ్ళపల్లి పీఠికలు, జానమద్ది హనుమచ్ఛాస్త్రి' భారతి, జనవరి 1979

# ఉపయుక్త గ్రంథసూచి


అప్పారావు, గంధం, డా॥ — వేమన-సర్వజ్ఞులు, మద్రాసు 1979

అశ్వత్థ నారాయణ; ఘట్టమరాజు సుందరం ఆర్వీయస్. (సంపాదకులు) — రాళ్ళపల్లి పీఠికలు, బెంగుళూరు, రాళ్ళపల్లి అభినందన సమితి, ప్రథమ ముద్రణ : 1978

ఆంధ్రసాహిత్య అకాడమి — సారస్వత వ్యాసములు (4 భాగములు) 1980
తెలుగు వ్యాసము—నూరు సంవత్సరాలు 1974

ఇనాక్ కొలకలూరి. డా॥ — తెలుగు వ్యాస పరిణామము, అనంతపురం జ్యోతి గ్రంథమాల, 1980

గోపి, ఎన్. డా॥ — ప్రజాకవి వేమన, చైతన్య ప్రచురణలు హైదరాబాదు, 1980

నరసింహం, కె.వి.ఆర్. — ఆంధ్రసాహిత్య దర్శనము, విజయవాడ : క్వాలిటీ పబ్లిషర్స్, 1979

నరసింహారావు, మునిమాణిక్యం. — మనహాస్యము, హైదరాబాదు : ఆంధ్రసారస్వత పరిషత్తు, 1968

బంగోరె, — వేమన—సి.ఆర్.రెడ్డి ఆంధ్ర విశ్వకళాపరిషత్తు విశాఖపట్నం, 1981

బ్రహ్మానంద, హెచ్.ఎస్. — తెలుగు సాహిత్య విమర్శ-పాశ్చాత్య ప్రభావం అక్షర ప్రసార ప్రచురణ-అనంతపురం

మాధవశర్మ, పాటిబండ. డా॥ — తెలుగులో సాహిత్య విమర్శ, హైదరాబాదు ఆం.ప్ర. సాహిత్య అకాడమి, 1975

యువభారతి — మహతి, హైదరాబాద్, 1976
ఆలోచనాలహరి' హైదరాబాద్, 1980

రంగనాథాచార్యులు, కె.కె. — తెలుగుసాహిత్య వికాసం ( 900-1947 సంవత్సరాల మధ్య) ఆంధ్ర సారస్వత పరిషత్తు తిలక్ రోడ్డు, హైదరాబాదు, 1979

రమణారెడ్డి, కె.వి. — కవికోకిల : (దువ్వూరి రామిరెడ్డి జీవితము-సాహిత్యము), నెల్లూరు, కవికోకిల గ్రంథమాల, 1965

రామలింగారెడ్డి, కట్టమంచి — కవిత్వతత్త్వ విచారము, వాల్తేరు : ఆంధ్రయూనివర్శిటి ప్రెస్ 1981
వ్యాసమంజరి, వాల్తేరు : ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథమాల : 1947

రామానుజరావు, దేవులపల్లి — యాభై సంవత్సరాల జ్ఞాపకాలు, వరంగల్ : సాహితీ బంధు బృంధం, చైతన్యసాహితి, 1981

రామారావు, ఎస్.వి. డా॥ — తెలుగులో సాహిత్య విమర్శ—అవతరణ వికాసములు, హైదరాబాదు : పసిడి ప్రచురణలు , 1974

లక్ష్మీకాంతము, పింగళి — 1. సాహిత్యశిల్ప సమీక్ష, హైదరాబాదు: మాధవీ బుక్ సెంటర్, 1976
2. గౌతమ వ్యాసములు, యమ్ యస్.ఆర్. మూర్తి అండ్ కో; విశాఖపట్నం, 1952

వీరభద్రరావు, కొత్తపల్లి, డా॥ — తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము సికింద్రాబాద్ : అజంతా ప్రింటర్స్, 1960

వేంకటావధాని, దివాకర్ల, డా॥ వల్లా దుర్గయ్య, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, (సంపాదకులు) — అక్షరార్చన, డా॥ పాటిబండ మాధవశర్మ గారి షష్టిపూర్తి సన్మాన సంచిక, హైదరాబాదు

శ్రీరామ అప్పారావు, పోణంగి డా॥ — తెలుగు నాటక వికాసము, సికిందరాబాదు: నాట్యమాలా ప్రచురణము, 1967

సుందరాచారి, శంకరంబాడి, వెంకటేశ్వరరావు, కనకమేడల, (సంపాదకులు) — శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ సన్మాన సంచిక, చిత్తూరు : 1961

సుందరం, ఆర్వియస్, అశ్వత్థనారాయణ, ఘట్టమరాజు, శ్రీరామచంద్రమూర్తి, శివలెంక, (సంపాదకులు) — అనంతరాగం, బెంగుళూరు : రాళ్ళపల్లి అభినందన సమితి, 1977

సీతారామయ్య, కురుగంటి, — నవ్యాంధ్ర సాహిత్య వీధులు, 4 భాగములు, హైద్రాబాద్ : హైద్రాబాద్ సాహిత్య పరిషత్తు 1949

సుబ్రహ్మణ్యం, జి.వి. డా॥ — ఆంధ్ర సాహిత్య విమర్శ—ఆంగ్ల ప్రభావం, హైదరాబాద్ : యువభారతి ప్రచురణలు, 1983

# BIBLIOGRAPHY

ABRAMS, M.H. The mirror and the lamp (Romantic theory and the critical Tradition) Oxford univ. press 1976. First Edition : 1953

ELIOT, T.S. Selected prose of T.S. Eliot. (Ed) - frank kermonda London : Faber and Faber, 1975

HUDSON, W.H. An Introduction to the study of English literature Ludhiana : Kalyani Publishers. 6 th Edition : 1975

OSBORNE HAROLD., Aesthetics and Criticism. London : Rout ledgu and kegan paul Ltd., 1975.

PRASAD, B. An Introduction to english criticism, Madras : The Macmillian and Co., of India Ltd ., 1976.

RICHARDS, I.A. Principles of literary criticism. London : Routledgu and kegan pal Ltd., 1970.

SANTAYANA, GEORGE., The sence of Beauty., New york : Dover Publications, Inc. 1896.

ALEXPREMINGER Encyclopaedia of poetry and poetics - princeton Univ., Press, First Edition 1965-Enlarged 1974.

The New Encyclopaedia Britannica-18 th Volume, Encyclopaedia Britannica Inc. william Benton Publisher 1943-1973, Helen Hemingway Benton, Publisher-1973-74.

# తప్పొప్పులు

| పేజీ | పంక్తి | ఇలావుంది | ఇలావుండాలి |
|---|---|---|---|
| 2 | 15 | అనాటి | ఆనాటి |
| 4 | 21 | సంభాంగణంలో | సభాంగణంలో |
| 5 | 27 | వాజ్మయ | వాఙ్మయ |
| 7 | 1 | మైసూరుతో | మైసూరులో |
| 7 | 1 | ఉండటంలో | ఉండటంతో |
| 7 | 7 | మీరాబాయి | మిరాబాయి |
| 14 | 6 | కావ్యాపరనం | కావ్యపతనం |
| 16 | 10 | మహాత్మ | మాహాత్మ్య |
| 16 | 22 | భావనావక్తి | భావనాశక్తి |

| | | | |
|---|---|---|---|
| 20 | 7 | స్పదించారు | స్పందించాడు |
| 28 | 5 | వారి | వారిపై |
| 32 | 9 | నాచని | నాచన |
| 34 | 2 | **Critieihsm** | **Criticism** |
| 34 | 13 | సర్వానరాల | సర్వానర్థాల |
| 34 | 15 | ఆనికులలో | ఆధునికులలో |
| 40 | 14 | గన | గల |
| 40 | 22 | కవిత | కవి |
| 43 | 27 | ఆర్థం | అర్దం |
| 50 | 4 | ఎకీభవించ | ఏకీభవించి |
| 50 | 12 | నాటకోపన్యాసమంలు | నాటకోపన్యాసములలో |
| 50 | 10 | భేదాంతం | ఖేదాంతం |
| 55 | 9 | ఆధ్యంతం | ఆద్యంతం |
| 56 | 14 | గేణమై | గౌణమై |
| 60 | 7 | సంయ్యమనము | సంయమనము |
| 61 | 9 | బాధ్యత | బాధ్యత |
| 61 | 18 | అష్టధిగ్గజాలు | అష్టదిగ్గజాలు |
| 68 | 17 | లంభికాశివయోగి | లంబికా |
| 69 | 26 | అనహ్యా | అసహ్య |